# ప్రబుద్ధాంధ్ర



౭ ౧౫ ఏప్రిల్ ౧౯౩౬ ౪

వార్షిక సంచికతో చందా ౧-౮-౦

సంపాదకుడు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి

# జీవామృతము




జీవామృతము బలహీనతవలన జనించు రుగ్మతలను ఆటంకపరచి, దేహమునకు సంపూర్ణ ఆరోగ్యమును, రక్తవృద్ధి, నరలముకు పటుత్వము, కండ పుష్టిని, భీమబలమును, తేజస్సును, జ్ఞాపకశక్తిని వృద్ధిపరచును.

జీ వా మృ త ము

ఆరోగ్యమును పునఃప్రతిష్ఠింపగల ప్రాణదాత

---

# బాలభాస్కర

బి డ్డ ల

లి వ ర్ & స్ప్లీ న్

వ్యాధులకును, ఇతర ఉదరసంబంధమైన వ్యాధులకు సిద్ధౌషధము.

వ్యాధుల వివరములు తెలిపిన మంచి సలహా యొసగబడును.

క్యాటలాగు కోరువారికి ఉచితము.




ఆ యు ర్వే దా శ్ర మ ము

పోస్టుబాక్సు 287, మదరాసు.

# బెజవాడ సరస్వతీ బుక్ డిపోవారి స్వంత ప్రచురణములు

| | | | | |
|---|---|---|---|---|
| **డిటెక్టివు నవలలు** | | | | |
| బంగారు బరిణె | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| సుడిగాలి | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| శిశుహత్య | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| డిటో | III | 1 | 0 | 0 |
| యమదూత | | 1 | 0 | 0 |
| మంత్రదగ్ధ | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| రక్తజ్వాల | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| గజదొంగ | | 0 | 12 | 0 |
| సరళ | | 0 | 12 | 0 |
| నారీపిశాచి | | 0 | 12 | 0 |
| ప్రతాపదౌర్జన్యము | | 0 | 12 | 0 |
| చోరాగ్రేసరచక్రవర్తి | | 0 | 12 | 0 |
| పేటికాంతరశవము | I | 0 | 12 | 0 |
| డిటో | | 0 | 12 | 0 |
| విషజ్వాల | | 0 | 12 | 0 |
| హత్యావినోదిని | | 0 | 12 | 0 |
| ఇందిర | | 1 | 0 | 0 |
| వాడేవీడు | | 0 | 12 | 0 |
| ఘోరకలి | | 0 | 12 | 0 |
| రూపసుందరి | | 0 | 12 | 0 |
| **చరిత్రాత్మక నవలలు** | | | | |
| వనదుర్గము | | 1 | 0 | 0 |
| తపోవనము | | 1 | 0 | 0 |
| జపమాలిక | I | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| తానీషా | | 1 | 0 | 0 |
| మానసింగు | | 1 | 0 | 0 |
| కిన్నెరి | | 1 | 0 | 0 |
| కాళిదాసభవభూతులు | | 1 | 0 | 0 |
| **వివిధరకములు** | | | | |
| మహాపతివ్రతలకథలు | | 0 | 8 | 0 |
| అస్పృష్టదీపిక | | 0 | 12 | 0 |
| జ్యోతిషఫలప్రదర్శని | | 0 | 12 | 0 |
| దస్తావేజుమతలబు | | 0 | 8 | 0 |
| దండకరత్నములు | | 0 | 6 | 0 |
| పన్నెండురాజుల కథలు | | 0 | 12 | 0 |
| హిందూస్థానీ తెలుగుబోధిని | | 0 | 6 | 0 |
| హిందీబాలశిక్ష | | 0 | 3 | 0 |
| ఘాలి సుబ్బారావు పాటలు | I | 0 | 12 | 0 |
| డిటో | II | 0 | 12 | 0 |
| వేడుకపెండ్లిపాటలు | | 0 | 8 | 0 |
| మహిళామనోరంజని పాటలు | | 0 | 5 | 0 |
| **వైద్యగ్రంథములు** | | | | |
| గృహవైద్యచికిత్సారత్నము | | 1 | 0 | 0 |
| డిటో | II | 1 | 0 | 0 |
| ఆయుర్వేదవైద్యసారము | | 1 | 0 | 0 |
| పశువైద్యము | | 0 | 6 | 0 |
| గోసాయిచిట్కాలు | | 0 | 8 | 0 |
| వస్తుగుణప్రదీపిక | | 4 | 0 | 0 |
| మనయింటివైద్యుడు | | 0 | 6 | 0 |
| **ప్రబంధములు** | | | | |
| భాగవతరత్నములు | | 1 | 0 | 0 |
| వేమనరత్నములు | | 0 | 12 | 0 |

మా వద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేటలాగు ఉచితముగా పంపబడును.

వలయువారు :— **కురుకూరి సుబ్బారావు,** ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

# అత్యద్భుత శాస్త్ర ప్రయుక్త సంతాన నిరోధక దివ్యౌషధములు

**గర్భ నిగ్రహవటి**

(రిజిష్టర్డు)

ఒక సంవత్సరమువరకు మాత్రమే గర్భము రాకుండ చేయును. 12 మాత్రల సీసా వెల రు 2—0—0




**గర్భ నివారిణి**

(రిజిష్టర్డు)

శాశ్వతముగా గర్భము రాదు. 15 మాత్రల సీసాయున్ను 8 ఔన్సుల మందును కలిసి వెల రు 5—0—0

కొంతకాలమువరకు గర్భము ధరింపకుండ యుండవలెనను కోరిక గలదా? లేక శాశ్వతముగా గర్భధారణములేక యుండు కోరిక గలదా?

ఎట్లైనను, మావద్ద మంచి నమ్మకమైన మందులు గలవు. ఇవి శాస్త్రప్రయుక్తముగ తయారు చేయబడినవి. ఏమాత్రము అపాయములేదు. అమోఘముగా పనిచేయును. పెక్కుమంది వైద్యులు ఆమోదించియున్నారు.

అభిప్రాయములు.

(1) డా. ఏ. చటర్జి, L. M. S. :—గర్భనిగ్రహవటి, గర్భనివారిణి, సంతాననిరోధమునకు నమ్మకముగల అమోఘములగు ఔషధములు * * ఇవి నిరపాయకరములు. కావున నేను వీనిని సిఫారసు చేయుచున్నాను.

(2) సి. మహాదేవమొదలియారు, సెనేటుహౌసు మదరాసు :—ఏడేండ్లక్రిందట గర్భనివారిణిని నాభార్య సేవించినది. ఆమె గండము గడచినది. దీనిని పలువురు బంధువులకు మిత్రులకు సిఫారసు చేసితిని. వారందరును దీనిని వాడి యద్భుతశక్తిని వేనోళ్ల కొనియాడిరి.

ఆయుర్వేదభూషణ, పండిట్ కే. సుబ్రహ్మణ్యశాస్త్రి,
ఏ. కే. ఏ. సి., 18 కలవచెట్టివీధి, చింతాద్రిపేట,
మదరాసు.

## కేసరి రత్నత్రయము

### లోధ్ర

గర్భాశయరోగ నివారిణి

స్త్రీలకు గలుగు ఋతుశూల, బహిష్టి కాకుండుట, అకాలబహిష్టి, మైల జాస్తిగాను, తక్కువగాను పోవుట, కుసుమరోగము, సంతానహీనత, రక్తహీనత, మలబద్ధకము, సూతికావాతము, కీళ్లనొప్పులు, అరికాళ్లు, అరచేతులు మంట మొదలగు స్త్రీ మర్మవ్యాధులను కుదుర్చును.

వెల 12 ఔ రు 3; 6 ఔ రు 1-10-0

### అమృత

రక్తశుద్ధి ద్రావకము

ఇది రక్తహీనత, మలబద్ధకము, అజీర్ణము, కీళ్లనొప్పులు, సోమరితనము, మేహవ్రణములు, ముఖసంకటములు, నిస్సత్తువ, కడుపులోమంట మొదలగు వ్యాధులను నివారించి శరీరమునకు కాంతిని ముఖమునకు తేజస్సును ఇచ్చును.

వెల 12 ఔ రు 3; 6 ఔ రు 1-10-0

### అర్క

సర్వజ్వర నివారిణి

వాత, పిత్త, కఫ, విషమ, శీత, సన్నిపాత, ఆగంతుకాది సమస్త జ్వరములను నివర్తించును.

వెల 6 ఔ 2-8-0; 3 ఔ 1-8-0
1 ఔ 0-8-0

**కేసరికుటీరం**

ఎగ్మూరు :: మద్రాసు

తెనుగు జిల్లాలకు సోల్ ఏజంట్లు :—

**మెసర్సు సీతారాం జనరల్ స్టోర్సు**

మెయిన్ రోడ్డు, బెజవాడ

సంవత్సరాది విడుదల. చిరకాలమునుండి వేచియున్న చిత్రరాజము

# లక్ష్మీ ఫిలింసువారి
# ద్రౌపది

**20-3-1936** శ్రీ వేంకటేశ సినిమా, తెనాలి.

**24-3-1936** (సంవత్సరాది) నెల్లూరు, ఏలూరు, గుంటూరు, సికందరాబాద్.

మార్చి మాసాంతములోగా బెంగుళూరు, మద్రాసు, మొదలగు పట్టణములయందును ప్రదర్శింపబడనున్నది.

ఖండ ఖండాంతరములయందు భారతీయ నాట్యాభినయనృత్యములు చూపిన శ్రీ రాగిణీదేవి, గోపీనాథుల భరత నాట్యము నయనానందకరముగ తిలకింపుడు.

రాజసూయ యాగము సందర్భ నాగస్వరకచ్చేరీలు, నాట్యములు, మనసు మరపించు నయనభావదృశ్యములు, కర్ణ రసాయనములగు గానములు, హృదయ రంజకములగు అభినయములు గాంచి ధన్యులుగండు.

ఆంధ్రదేశమునందు ఆబాలగోపాలమును కొనియాడు సుప్రసిద్ధ నటనటీ వర్గమంతయు పాల్గొనుచున్న ప్రథమ చిత్రము.

శ్రీయుత సి. రామానుజాచార్యులు, మాధవపెద్ది, చిత్రా గోపాలు, డాక్టరు శివరామకృష్ణరావు, పారుపల్లి, బందా కనకలింగేశ్వరరావు, పి.వి. సుబ్బారావు, దాసు, చౌదరి, మిస్. సురభి కమలాబాయి, మిస్, లీలాబాయి, మిస్. శ్రీహరి, శ్రీమతి అన్నపూర్ణాదేవిగారు మొదలగువారు నటించిన సాటిలేని చలనచిత్రము.

| | |
|---|---|
| దుర్యోధనుని ఈర్ష్య, ధర్మరాజుని శాంతము, భీమసేనుని క్రోధము శకుని తంత్రము ద్రౌపది పాతివ్రత్య ప్రభావము గాంచి పరవశముగాంచుడు. | విఖ్యాతమగు మైలవరం పాటలు, పీరా సాహెబుగారి నాగస్వరము వీనులారా వినుడు. |

**For Booking Apply to:-**

## Lakshmi Films Ltd.,

**3-7, Tata Muthiappan Street, G. T. MADRAS.**

Telegrams :—LUCKYFILMS, MADRAS






వైద్యుడు నిషేధించాడు. తరవాత దానివల్ల పోలికలు తెలుసుకుని—(అర్థోక్తి)

ఓబమ్మ—రెండు దినాలా? ఈలోపున వా డెక్కడి కేనా ఉడాయించెయ్యడూ?

తిమ్మరుసయ్యంగారు—నా కలా తోచడం లేదు. అసలు, ఆహంతకు డెవ డయినా, ఏదో దారుణం తల పెట్టుకుని ఉంటాడు. కొద్ది రోజులపాటు ఎక్కడి కేనా పారిపోయినా మళ్ళీ రాక మానడు. అప్పటికి తప్పకుండా పట్టించి, వాణ్ణి, తమ కిష్టమయితే ఏనుగు కాళ్ళకింద—మన కిరమల్లన్నకు పట్టుపడకుండా తప్పించుకోగలిగే వా డెవ డమ్మా?

ఓబమ్మ—వా డెవ డయి ఉంటాడనీ తమ అభిప్రాయం?

తిమ్మరుసయ్యంగారు—నా కేమీ ఆలోచన తెగడం లేదు. అసలు, మనమీద పగపట్టవలసిన అవసరం యెవరికీ?

ఓబమ్మ—అదేమిటి పంతులుగారూ తమ రలా సెల విస్తారూ? నాసవతిమీద తమకు అనుమానం కలగడమే లేదూ?

తిమ్మరుసయ్యంగారు—మొదట వారిమీదే కలిగింది; కాని అది నిలిచింది కాదు.

ఓబమ్మ—ఏమిటి?

తిమ్మరుసయ్యంగారు—వారి పక్షంలో ఆయీనడు యెనకు దెవ డున్నాడూ?

ఓబమ్మ—కూలికి వచ్చినవాడు కాకూడదూ?

తిమ్మరుసయ్యంగారు—ఉన్న ఒక్క కొడుకూ పోయి, అధికారం నాడే లేక—ఆమె మాట యెవరు వింటారమ్మా? డబ్బు కక్కుర్తి ఏమంతేనా చేయిస్తుంది. నిజమే. అయితే; అగ్నిహోత్రంవంటి తమకి అప్రియం చెయ్యడానికి సాహసించగల వా డెవ డమ్మా?

ఓబమ్మ—అయితే తమ ఊహ యేమిటీ?

తిమ్మరుసయ్యంగారు—నా ఊహ ఒక్కటే. పూనుకుంటే హంతకుణ్ణి నిమిషాలలో పట్టుకోవచ్చు. కైదు చెయ్యవచ్చు. చిత్రవధ చేయించవచ్చు. బతికి ఉండగా చర్మం ఒలిపించవచ్చు. ఉప్పుపాతర వెయ్యవచ్చు; కాని మనం, యిప్పుడే యీవ్యవహారం ప్రారంభిస్తే ఈకల్లోలాలను పురస్కరించుకుని సామంతులలో ఎవ రేనా—(అర్థోక్తి)

ఓబమ్మ—అదీ నిజమే నండి. (తటపటాయిస్తూ) పట్టాభిషేకం కాస్తా అయిపోయిం దంటే ప్రజలు తమకి తామే సరిపుచ్చుకుంటారు. విద్రోహులకు అప్పుడు కుమ్మక్కు చేసే వా రుండరు. సైన్యం కూడా ఒక శక్తికి అంకితం అయిపోతుంది; ఇక అంతఃకలహాలకు అవకాశా లుండవు.

తిమ్మరుసయ్యంగారు—ఇలాంటి ప్రయోజనం సిద్ధించాలంటే మనం యిప్పుడు చాలా గంభీరంగా ఉండాలి. మనం, అసలు, దీనిని గమనించనే లేనట్టు ప్రజలకు తోచేటట్టు నడుచుకోవాలి. నిజానికి, ఎవరో తుంటరివాడు—ఏదో కారణంవల్ల ఉద్రేకం పొందినవాడు వేసిన యీ కుప్పిగంతులకు మనం యింతగా—(అర్థోక్తి)

ఓబమ్మ—అదేమిటి పంతులుగారూ! కోటలో—అందులో అంతఃపురంలో—(అర్థోక్తి)

తిమ్మరుసయ్యంగారు—వాణ్ణి మన మెలాగా బతకనివ్వము. ఇది కూడా తమకి మనవిచెయ్యాలా?

ఓబమ్మ—తమ ఉద్దేశమూ, భవిష్యత్తూ గమడగోయ్యిగా ఉన్నాయి. ఏమీ బోధకావడం లేదు.

తిమ్మరుసయ్యంగారు—అలా అయితే; ముందు ఆపనే చేయిస్తాను, సెల విప్పించండి.

ఓబమ్మ—అదా మరోటా ముందు చెయ్యడం? వ్యవహారం అంతా తమమీద విడిచిపెట్టాను. మధ్య మధ్య సలహాలు మాత్రమే నేను చెబుతూ ఉంటాను. చివరి కేది చేసినా, ఏది మానినా తమ యిష్టం. అందుకు నే నేమీ అడ్డుచెప్పడం లేదు మాభారం అంతా తమమీదే ఉన్నది; కాని నామనస్సులో ఉన్నది చెప్పవద్దూ?

తిమ్మరుసయ్యంగారు—చెప్పకపోతే యెలాగ అమ్మా? నేను తమ భృత్యుణ్ణి—(అర్థోక్తి)

ఓబమ్మ—తమ రలా సెల విప్పించకూడదు.

తిమ్మరుసయ్యంగారు—తమ అనుగ్రహానికి చాలా సంతోషం. అయితే నేను తమ భృత్యుణ్ణి. ఇందు కేమీ సందేహం లేదు. ఇలా చెప్పుకుంటే నాకు పరువే గాని అప్రతిష్ఠ యేమీ లేదు. పైగా, యిలా చెప్పుకుంటేనే నాకు పరువు తక్కుతుంది. చక్రవర్తికి పాదాలు ఒత్తే వాడు కూడా బాగా అదృష్టవంతుడయి ఉండాలి. అలాంటప్పుడు మంత్రిసంగతీ, దండనాథుని సంగతీ చెప్పడం యెందుకూ? కనక మహామంత్రి కూడా స్వతంత్రుడు కాడు. భృత్యుడు. పెద్ద భృత్యుడు. అంతే.

ఓబమ్మ—తమతో నేను వాదించగలనా? కాని తమలో తమ రేమనుకున్నా నేను తమన్ని విజయనగర సామ్రాజ్యానికి మూలాధారంగా భావించుకుంటున్నాను. ఈచిక్కు లన్నీ తీర్చి, సరియైన ప్రభుత్వం యేర్పడ్డ దని ప్రజలు సంతోషించేలాగ—(అర్ధోక్తి)

తిమ్మరుసయ్యంగారు—నా రక్తం ధారపోస్తాను. తమ కోరిక నెరవేరుతుంది. వీరనరసింహరాయలవారిని మించిన ప్రభువు దొరికా డని ప్రజలు సంతోషిస్తారు.

ఓబమ్మ—అబ్బాయి మొగంమీద మంచి కళ ఉన్నది. తమరు చిత్తగించారా?

తిమ్మరుసయ్యంగారు—విజయనగరప్రభువులలో ఇలాంటి జాతకుడు పుట్టలే దంటారు సిద్ధాంతిగారు.

ఓబమ్మ—అంతవాణ్ణి తమరు చెయ్యాలి. ఓబమ్మ కుర్రవాణ్ణి బాగుచేసిం దని నాకు కీర్తి రప్పించాలి తమరు.

తిమ్మరుసయ్యంగారు—చిత్తం చిత్తం. వీరనరసింహ రాయలవారు ఇంటా బయటా కూడా స్వతంత్రంగా వ్యవహరించారు. అప్పుడు నాశక్తి నేను తెలుసుకోడానికే అవకాశాలు లేకపోయాయి. ఇక నేను తమన్ని ఆశ్చర్య చకితులుగా చేస్తాను.

ఓబమ్మ—తమ రంతవారూ అవుతురు. సందేహం లేదు.

తిమ్మరుసయ్యంగారు—మరి, ఒకమాటు వైద్య శాలకు వెళ్ళి గంగుని చూసి—(అర్ధోక్తి)

ఓబమ్మ—చిత్తం చిత్తం. వాడి పోకిళ్ళు అన్నీ బాగా జ్ఞాపకంచేసుకుంటూ ఉండమని చెప్పండి గంగుతోటి.

తిమ్మరుసయ్యంగారు—చిత్తం. సెలవు.

ఓబమ్మ—దయచెయ్యండి.

తిమ్మరుసయ్యంగారు—మళ్ళీ రేపు తెల్లవారేటప్పటికి దర్శనం చేసుకుంటాను. (వెళ్ళిపోతాడు)

ఓబమ్మ—తిమ్మరుసయ్యంగారు చెప్పింది బాగానే ఉన్నది. నిజమే. ఈమాత్రానికే మనం కంగారు పడ్డట్టు తెలిస్తే ప్రజలను అదుపు ఆజ్ఞల్లో ఉంచడం కష్టం. తిమ్మరుసయ్యంగారి ప్రతిభకు చాలింది మరి లేదు. అయినా నామనసులోపల మంచి విశ్వాసం ఉన్నా................ హా! హా! ఉన్నది ఊరికే పోతుందా?

తొమ్మిదో రంగం

(నాగమ్మ గారు. నాగమ్మా నీలమ్మా కూచుని ఉంటారు. ఇద్దరికీ మధ్య నిక్కిసిక్కి పైన ఒక కైజారు ఉంటుంది. లక్ష్మమ్మ అప్పుడే వస్తుంది. పెయ్యన్న ఆ వాకిటికి నిలిచివుంటాడు)

నాగమ్మ—దయచెయ్యండి లక్ష్మమ్మగారూ! నీలం ఒక మృగాన్ని కొట్టింది.

లక్ష్మమ్మ—(నీలమ్మకేసి ప్రశంసగా చూస్తూ, కూచుంటూ) నీలమ్మ గెలుచుకుంటే యింకా అడ్డా? (కైజారు చూసి) ఇంకా తడిగానే ఉన్నది.

నాగమ్మ—ఇప్పుడే పొడిచేసింది. పచ్చినెత్తుటితోటే నాకు చూపించడానికి తెచ్చింది కైజారు.

లక్ష్మమ్మ—చాలా బాగుంది. అయితే—(అర్ధోక్తి)

నాగమ్మ—నీలం కసిదీర్చుకున్నది. విరూపాక్షరాయడికి కళ్ళు తిరిగిపోతూ ఉండేవిట.

లక్ష్మమ్మ—ఆ!......మిడతగాడు!

నాగమ్మ—చివరికి మిడతే అయిపోయాడు. నాకి నెత్తుటితో నీలానికి నేను బొట్టుపెట్టాను. తమరుగూడా ఉంచండి.

లక్ష్మమ్మ—(కైజారు పుచ్చుకుంటూ) తప్పకుం డానూ. (నీలమ్మ నుదుట బొట్టు పెడుతూ) నాకూనా! మరొక గ్రహాన్ని వదలగొట్టావు.

నాగమ్మ—అభూతం కబురుచెయ్యగా సాళువ నారాయడుగారు అప్పుడే బయలుదేరి వెళ్లారుట. వారు

గమ్మం కదలడం తోటే విరూపాక్షుడు సాక్షాత్కరించి ప్రేమభిక్ష—(అర్ధోక్తి)

నీలమ్మ—ఆమాట చెవిని పడేటప్పటికి నాకు రక్తం ఉడుకెత్తిపోయింది. వొళ్లు తెలవలేదు. ఒక్క క్షణానికి మూలుగు వినపడి ప్రజ్ఞ తెలిసింది. కత్తులు ఊడ లాక్కొగా పేగులు బయటికి వచ్చాయి. అరటిబోంది లాగ తివాసీ నిండుగా పడిపోయాడు రాక్షసుడు.

లక్ష్మమ్మ—(నీలమ్మ చెక్కిలు నిమురుతూ) బిడ్డా! ఆ భూతానికి నువ్వే నిమిత్తమయ్యి విరిచేశావు. ఒక్క దెబ్బతో రెండు ప్రాణాలు సాధించావు. (నాగమ్మకేసి చూస్తూ) ఏమంటావు? ......... దేవుడు చూడలేకపోయాడు.

నాగమ్మ—నాకర్మం అలా కాలిపోయింది. కడ తేరి నాయనా, మోసపోయి నీలమూ నాకడుపులో చిచ్చు—(అర్ధోక్తి)

లక్ష్మమ్మ—వద్దు వద్దు. తమరు కళ్లనీళ్లు పెట్టుకున్నారంటే చేతిలో ఉన్న కార్యం జారిపోతుంది. నీలం చేసిన పనికి సంతోషించవలసిన సమయం యిది. (వెనక్కి తిరిగిచూస్తూ) ఇలా రా తమ్ముడూ! నీసేతలు మహారాణీవారికి విన్నవించుకో.

నీలమ్మ—(ఇందాకా తమరు మనోవిగ్రహం— (అర్ధోక్తి)

లక్ష్మమ్మ—అదే చెబుతాడు మావియ్యన్న. ఏమి జరిగినది తమ్ముడూ!

వియ్యన్న—(నాగమ్మయెదటికి వచ్చి, చేతులు జోడించుకొని, తలవంచి) ఏలినవారికి మనోజ్ఞ సంతోషవార్త. త్రిలోచనరాయలవారు వేంచేశారు.

నీలమ్మ—(ఉలిక్కిపడి) ఎక్కడికి?

వియ్యన్న—స్వర్గానికి.

(“ఆ” అంటూ నీలమ్మా “ఏమన్నావూ?” అంటూ నాగమ్మా చకిత లవుతారు. లక్ష్మమ్మ చిరునవ్వుతో తల ఆడిస్తుంది)

నాగమ్మ—వివరాలు చెప్పండి పంతులుగారూ!

వియ్యన్న—ఏటి వొడ్డున తిరుగుతూ నేనూ కొండారెడ్డిగారూ మాట్లాడుకుంటున్నాము. కుమారశ్యామరాయలవారు చాలాదూరం ప్రోద్బలపరిచారని చెబుతూ, రెడ్డిగారు, అప్పుడే ఏలినవారి సేవకు అంగీకరించారు. సరిగా యీ సమయంలో త్రిలోచనరాయలవారు అక్కడికి వచ్చారు.

నాగమ్మ—అతగాడు మీ మాటలు వినలేదుకదా?

లక్ష్మమ్మ—వింటే మాత్రం ఇంకేమి భయమూ మహారాణీ!

నాగమ్మ— అవునవును. ఏమి జరిగింది నాయనా!

వియ్యన్న—రావడం తడవుగా నన్ను చూసి “నువ్వు కుట్రలు చేస్తున్నావుట. మహమ్మాయి నండిస్తా” అంటూనా పళ్లు కొరికాడు. ఇక నాకు వొళ్లు తెలవలేదు. ఒక్క వేటు వేశాను. కొబ్బరిపువ్వు లాగ నాడి తలకాయ కింద పడిపోయింది.

నీలమ్మ—భలే పని చేశావు.

నాగమ్మ—ఆ భూతం రెండో చెయ్యికూడా పడిపోయిందన్నమాటేనా?

లక్ష్మమ్మ—ఇంకా అనుకుంటున్నారా?

నీలమ్మ—(ఆవేశంతో) చాలదు, చాలదు. ఆ పురుగుని కూడా నలిపివేసి—(అర్ధోక్తి)

నాగమ్మ—(నీలమ్మ గడ్డం పట్టుకుని) చెప్పనియ్యి తల్లీ! (లక్ష్మమ్మకేసి చూస్తూ) దుష్టచతుష్టయంలో యిక వొక్క సాంబశివరాయ మిన్నాడు. (వియ్యన్న కేసి చూస్తూ) అంతేనా?

వియ్యన్న—చిత్తం, చిత్తం. వారొక్కరే ఉన్నారు. త్రిలోచనరాయలవారికీ తమకీ గల అంతఃకలహం కారణంగా యిప్పటిదాకా వారు కొంచెం తప్పించుకు తిరుగుతున్నారు. విరూపాక్షరాయలవారు కూడా లేరు కనక యిక వారు దీక్షపడతారు.

నాగమ్మ—వాళ్లిద్దరికంటే ఘటకుడు. ఒకపట్టాన లొంగడు.

వియ్యన్న—నిజమే. కాని విడిచిపెడతామా!

లక్ష్మమ్మ—మహాదేవరాయలవారు కూడా మన పక్షం అయినట్టు వారి మూడో భార్యా కబురు చేశారు..

వీరప్పనాయకుడు—(వియ్యన్న కేసి చూస్తూ) ఏమన్నాడు తమ్ముడూ?

వియ్యన్న—రుక్కమ్మగారి నగరు లూటీ చెయ్యాలని ఉంటే తలుపులు తెరిపించి ఉంచుతా నన్నాడు వీరప్ప.

నాగమ్మ—(సంగతి బోధపడనట్టు లక్ష్మమ్మ కేసి చూస్తుంది)

లక్ష్మమ్మ—తన గుర్రపు పేజుతో వీరప్పనాయకుణ్ణి రుక్కమ్మగారి నగరికి కాపలా వేశారు అక్కడి మహామంత్రి!

నీలమ్మ—(గభీమని లేచి) అయితే ఆపురుగుని కూడా నలిపివేసివస్తాను. ఏమండీ అత్తయ్యా?

నాగమ్మ—(ఆమె చెయ్యి పట్టుకుని కూచోపెడుతూ) తొందరపడకమ్మా! (వియ్యన్న కేసి చూస్తూ) ఇంకేమిటి నాయనా?

వియ్యన్న—ఓబమ్మగారు మనమడుగారిని తమ నగరిలో ఉంచుకున్నారు.

నాగమ్మ—(నీలమ్మ కేసి చూస్తుంది)

నీలమ్మ—రాకాసిపీనుగా!

లక్ష్మమ్మ—ఇప్పటికి జరిగిందంతా బాగానే జరిగింది. అచ్యుతరాయలవారికి రాజ్యాశ పొటమరించుతూ ఉన్నదిట. కాని ధైర్యం చాలదు. గంగుని పొడిచిన హంతకుడికోసం (నీలమ్మ కేసి చూస్తూ) వీరమల్లన్న పూనుకున్నాడుట.

నీలమ్మ—(నవ్వుతూ) వాడప్పుడే మాయమయి పోయాడు. ఇక దేవుడికేనా దొరకడు.

నాగమ్మ—మీరు చూడలేదు కాని ఆవేళ అచ్చంగా మొగపిల్లాడయిపోయింది సుమండీ నీలం.

లక్ష్మమ్మ—(తలపంకిస్తూ) చీమతలకాయంత దాటిపోయింది......అయితే, తమరు విన్నారో లేదో గాని ఆపోటుతో ఆపిల్లాడి కుడిచేతి తర్జని యెగిరిపోయిందిట—(అర్థోక్తి)

నీలమ్మ—(ఎగిరిపడుతూ) ఏమిటీ? సెబాస్! బతికి ఉండినా వాడిక జీవచ్ఛవమే. అమ్మయ్యా! రామయ్య తండ్రీ! మహా బాగా జరిగింది, ఏమండీ అత్తయ్యా?

నాగమ్మ—బాగుంది నాకూనా! (లక్ష్మమ్మ కేసి తిరిగి) ఇంకేమిటి లక్ష్మమ్మగారూ?

లక్ష్మమ్మ—ఇప్పటి కింతే. మధ్యాహ్నం మళ్లీ దర్శనం చేసుకుంటాము.

నాగమ్మ—చిత్తం.

(అంతా లేస్తారు. వియ్యన్న ముందు బయలుదేరతాడు)

పదోరంగం

(ఓబమ్మనగరు. ఓబమ్మ ఒకపీటమీద కూచుని ఉంటుంది. ఎదట ఒకదాసీ నుంచుని ఉంటుంది)

ఓబమ్మ—తిమ్మరుసయ్యంగారు లేరే?

దాసి—వారికి నామాటలు వినపడనేలేదు. వారు ప్రళయకాలరుద్రులై ఉన్నారు.

ఓబమ్మ—ఏమీ?

దాసి—ఏటి వొడ్డున, ఒక యోగి, చెయ్యిపట్టుకుని గుడ్డికృష్ణరాయలవారిని నడిపించు—(అర్థోక్తి)

ఓబమ్మ—ఏమిటీ?

దాసి—ఈసంగతి తెలిసి, తిమ్మరుసయ్యంగారు, మండిపడి, వారిని పట్టి బంధించవలసిందని గుర్రపుపోజిచ్చి జగ్గారాయడుగారిని తరిమారు. "మీరు తప్పించుకు తిరగడం యేమీ బాగా లే" దని సాంబశివరాయలవారిని మందలిస్తున్నారు కూడానూ వారు.

ఓబమ్మ—అది మంచిపని.........ఈయోగులకు వైద్యం కూడా తెలిసిఉంటుంది. మళ్లీ మొదటికి వస్తుందో యేమిటో?

దాసి—పెంకితనం చేస్తే యిద్దర్నీ సరికివెయ్యవలసిందని మహామంత్రి సెలవిచ్చారు. ఇదివరకి మాట యేమయినా కృష్ణరాయలవారికిక చావు తప్పదు.

ఓబమ్మ—దొరకాలి కదా?

దాసి—ఒకవేళ జగ్గారాయడుగారు ద్రోహం చేస్తారేమో అని శంకించి, మహామంత్రి, వారికి తెలవకుండా

వెళ్లి, ఆచోకీ తీస్తూ ఉండవలసిన దనీ, అనుమానం కలిగితే ముందు జగ్గారాయలవారిని బంధించవలసిన దనీ సాంబశివరాయలవారికి ఆజ్ఞాపించారు.

ఓబమ్మ—జగ్గారాయడే ద్రోహం చేస్తాడా ?

దాసి—ఎవరు చెప్పగిలరు అమ్మా? కృష్ణరాయల వారికి ఒకటిరెండు యుద్ధాలలో జగ్గారాయలవారు అను చరులుగా ఉండి పనిచేసినవారుట. అందువల్ల మహా మంత్రి, వారిని నమ్మలేకుండా ఉన్నారుట. అయినా తమకి వారిమీద ఎక్కువ నమ్మకం ఉండడంవల్ల—(అర్థోక్తి)

ఓబమ్మ—జగ్గారాయడిమీద నా కెప్పుడూ ఎలాంటి అనుమానమూ కలగలేదుసుమా !

దాసి—విరూపాక్షరాయలవారినీ, త్రిలోచనరాయల వారినీ తమ నలాగే నమ్మారు. ఇప్పుడు వారి జాడే లేకుండా ఉన్నది.

ఓబమ్మ—తిమ్మరుసయ్యంగారి కేమేనా తెలిసిం దేమో ?

దాసి—విరూపాక్షరాయలవారి జాగీరులో సైనికులు సన్నాహంలో ఉన్నారుట.

ఓబమ్మ—ఏమిటీ ?

దాసి—త్రిలోచనరాయలవారి వంశుని నిరాయు ధంగా చెయ్యా లని మహామంత్రి ఆలోచిస్తున్నారు.

ఓబమ్మ—కల్లోలాలు పెరిగే లాగున్నాయి. వెళ్లి తిమ్మరుసయ్యంగారిని నుంచున్న పాలంగా తీసుకురా.

దాసి—చిత్తం అమ్మా !

---

పదకొండో రంగం

(తుంగభద్ర ఒడ్డున, అచ్యుతరాయడు, ఒక రాతిపలక మీద కూచుని ఉంటాడు. ఎదట వియ్యన్న నుంచుని ఉంటాడు.)

అచ్యుతరాయడు—సెల విప్పండి.

వియ్యన్న—తమకు సందేహం యెందుకు కలిగిందో నాకు బోధపడకుండా ఉన్నది.

అచ్యుతరాయడు—వివరంగా చెబుతాను వినండి. పెద్దన్నయ్యగారు ప్రభువు కనక తిమ్మరుసయ్యంగారు భక్తిప్రపత్తులతోటే వారి యెదట మసిలేవారు. చిన్న న్నయ్యగారినీ, నన్నూ వారు, శిష్యులుగా భావించే వారు. మాయిద్దరిలో చిన్నన్నయ్యగా రంటే వారికి ప్రీతి యెక్కువ.

వియ్యన్న—వారిప్పుడు లేరు కాదూ ?

అచ్యుతరాయడు—కనక, నిజానికి, తిమ్మరుసయ్యం గారు, చిన్నన్నయ్యగారిమీది వాత్సల్యం కూడా నా మీద కేంద్రీకరించాలి. ఇది ధర్మం. కాని అలాంటి దేమీ కనపడదు.

వియ్యన్న—ప్రస్తుతకల్లోలా లడిగేదాకా—(అర్థోక్తి)

అచ్యుతరాయడు—వారు, బుల్లిబాబుకే పట్టాభిషే కం చెయ్యాలని నిశ్చయించుకోవడం బాగున్నదా ?

వియ్యన్న—కారణం తమకి తెలిసి ఉండాలి.

అచ్యుతరాయడు—మహారాజు కొడుకనీ. ఇది అంద రికీ తెలిసిందే; కాని చెట్టంతవాణ్ణి నేనుండగా—(అర్థోక్తి)

వియ్యన్న—అది నిజమే. తమరు ఓబమ్మాదేవిగారి అనుగ్రహం సంపాదించి ఉండవలసినది.

అచ్యుతరాయడు—అనుగ్రహమా ! వారు నన్ను మాత్రం కడతేర్చ రని యెలాగా నమ్మడం ?

వియ్యన్న—పాపం శాంతించుగాక. పాపం శాంతిం చుగాక............నేను మనసిచ్చి అడుగుతున్నాను. తమకు సంగతి అంతా తెలిసి ఉంటుంది. కృష్ణరాయల వారి కళ్లు పీకించడంలో ఓబమ్మాదేవిగారి సలహా యెంత మాత్రమూ లే దని నానమ్మకం. నాగమ్మాదేవిగారి అనుమానం నిరాధారం అని కూడా నాకు గట్టి నమ్మ కం ఉన్నది. తమ రేమంటారూ ?

అచ్యుతరాయడు—అసలీ సంకల్పం పెద్దదొడ్డమ్మ గారికే కలిగిం దంటాను నేను.

వియ్యన్న—అయితే; తమరుగూడా అసహాయశూ రులే కదా, తమవిషయంలో వారి కలాంటి సంకల్పం యెందుకు కలగలేదూ ?

అచ్యుతరాయడు—ఆసంకల్పం పెద్దన్నయ్యగారికి మట్టుకే కలిగిఉంటే వారుమాత్రం నన్నెందుకు విడిచి పెట్టారూ?

వియ్యన్న—కనక యీ ఊహలు మనస్సును మరింత గజబిజపరుస్తాయి. ఏమి జరుగుతుందో చూస్తూ ఉండడం నాసలహా.

అచ్యుతరాయడు—విజయనగర సామ్రాజ్యం మాతం డ్రిగారి స్వార్జితం. వారితరవాత అంతటివాడను నేనుండగా నాకు మిందుతరం—పసిపాపకు పట్టాభిషేకం—(అర్థోక్తి)

వియ్యన్న—ఓబమ్మాదేవిగారు పెత్తనం అంతా తమమీదే ఉంచుతా రేమో?

అచ్యుతరాయడు—అలాంటి మాటలు చెప్పకండి. పెద్దదొడ్డమ్మగారికే స్వయంగా రాజ్యాశ ఉన్నది. బాలుణ్ణి చూపిస్తూ వాగే సర్వమూ స్వాధీనపరుచుకుంటారు............ఇక మన సిచ్చి మాట్లాడతాను. తాము నాకొక ఉపకారం చేసిపెట్టాలి.

వియ్యన్న—సెల విప్పించండి.

అచ్యుతరాయడు—సైన్యం అంతా యిప్పుడు అప్పన్నగారి స్వాధీనంలో ఉన్నది. వారి యెదటపడి నాకోరిక విన్నవించుకోడానికి నేను సాహసించలేకుండా ఉన్నాను. తమకూ వారికీ దేహాలు మాత్రమే వేరు. వారికి నామీద అనుగ్రహం కలిగేటట్టు తాము రాయబారం చెయ్యాలి. (వియ్యన్న చేతులు పట్టుకుని) తమ సెలవు ప్రకారం నడుచుకుంటాను. సింహాసనం నాకు స్వాధీనం చేయించండి. తరవాత తమ యిష్టం.

వియ్యన్న—తమకు నాయెడల కలిగిన విశ్వాసానికి ఆశ్చర్యం కలుగుతోంది. తమ ఆజ్ఞ నిర్వర్తిస్తాను.

అచ్యుతరాయడు—శుభవార్త కోసం యెదురుచూస్తూ ఉంటాను.

వియ్యన్న—అయితే, ఒకటి ఉన్నది. రేపు లేదు, ఎల్లుండి పట్టాభిషేకముహూర్తం. ఏమి జరిగినా ఆ సమయంలో జరగాలి. అంతవరకూ ఊపిరి కూడా పైకి విడిచి పెట్టగూడదు. తమ ప్రయత్నంలో తాముండండీ.

అచ్యుతరాయడు—చిత్తం. జగ్గారాయలవారు నాకు ఆధారంగా ఉన్నారు. అసలు నాకీ సంకల్పం కలిగించిన వారే వారు. వారి దండంతా నాకోసం ప్రాణాలకు తెగించి ఉన్నది.

వియ్యన్న—విజయనగరంలో ఉన్న పడవాళ్లలో జగ్గారాయలవారిని చెనకగలవారు మరి లేరు. తమకు మంచి బలమైన ఆసరా దొరకినది.

అచ్యుతరాయడు—తమఆసరా అంతకంటె గొప్పదీ.

వియ్యన్న—పొట్టకూటికిగాణ్ణి నేను. నేనొక లెక్కా? మరి తమరు దయచెయ్యండి. మనం ఏకాంతంగా ఏదో మాట్లాడుకున్నా మని ఇతర్లకు తెలవడం శ్రేయస్కరం కాదు.

అచ్యుతరాయడు—అవుసవును. మరి సెలవు. అయితే, నాకు కబురెలా తెలుస్తుందీ?

వియ్యన్న—నేను చేస్తా కాదూ?

అచ్యుతరాయడు—సెలవు. (వెళ్లిపోతాడు)

వియ్యన్న—"యాచకో యాచక శ్శత్రుః"...... నాగమ్మాదేవిగారి ప్రయత్నాల కిది మంచి సహకారి. (వెళ్లిపోతాడు)

సశేషం

---

# ద్రౌ ప ది

"చలం"

(కౌరవసభ. ద్రౌపది ముందూ, వెనక దుశ్శాసనుడూ ప్రవేశించారు)

దుర్యోధనుడు—పాంచాలీ! ఎదీ నావంక చూడు.

ద్రౌపది—ఎవరురా నువ్వు?

కర్ణుడు—సరిగా మాట్లాడు. నీవు మా దాసివి.

ద్రౌపది—దాసినా? దాసీపుత్రుడి కూడా దాసులు కావలసి వొచ్చారా? నేను దాసి నెట్లా ఐనాను? ద్రౌపది! దాసి! సభని ప్రశ్నిస్తున్నాను. ఇది న్యాయమా?

(చుట్టూ చూసింది. అందరూ తలలు తిప్పుకున్నారు)

కర్ణుడు—దుశ్శాసనా! దీని పోగి రణచలేవా? ప్రభువుముందు వదురుతోంది దీ దాసి.

దుర్యోధనుడు—ద్రౌపదీ! ఏదీ నీ నవ్వు? ఇప్పుడు చెయ్యి హేళన!

ద్రౌపది—స్వాధీనురాలను కాను. ఇంకా వుంది కాలం. మాయాద్యూతంతో ఆఖరు కాదు కాలం.

దుర్యోధనుడు—నీ దాసీత్వంతో ఆఖరు.

ద్రౌపది—మరణంతో. అంతమాత్రం తెలీదా?

దుర్యోధనుడు—మరణమా? ఎవరు నన్ను జయించేవారు? ఈ భానిసలే?

కర్ణుడు—ఇంతటి పౌరుషవంతురాలివి, ఈ ప్రభువుకే తగుదువు.

ద్రౌపది—ఒక్కరికే యేమిటి? నూర్గురినీ పరిణయమాడుతాను. అంత్యకాల రుద్రకాళీరూపధారిణినై భీకర యుద్ధభూమిలో యీ కౌరవాన్వయాన్నంతా రక్తారుణ హస్తాలతో ఆలింగనం చేసుకుంటాను. తొందరేమిటి?

దుర్యోధనుడు—అంతటిదానివే అవుదువు. ముందు యిట్లా నా తొడమీద కూచుని ఆలింగనం చేసుకో.

భీముడు—నేను సహించను. ఆ తొడల్నే నేను విరగగొట్టి—

ధర్మరాజు—భీమా! శాంతించు.

భీముడు—నీవు కపటజూదంలో భార్యను వొడ్డడం కన్న అధర్మం లేదు. నీకు జూదంలో చేతగాని రక్షణను నేను నా బాహుబలంవల్ల పునరుద్ధరిస్తాను. ఆమె చూపులోని నిందను నేను భరించలేను. ఐదుగురము శిలలవలె ఇట్లా కూర్చుని, యీమెను, మన రక్షణను నమ్మి మనను పరిణయమైన పత్నిని—

అర్జునుడు—భీమా! ధర్మరాజు ధర్మము తప్పుతాడా? ఇది విధిచర్య. శాంతించు.

ద్రౌపది—జేసినిసమర్థించడానికి భయమో అదంతా విధిచర్య. శాంతమా? భార్యను జుట్టుపట్టుకు యీడుస్తూ వుంటే సహించే శాంతం, అది శాంతమా, మృత్యువా? ధర్మరూపాన విజృంభించిన భీరుత్వమా? యీ పాండవ మహావీరుల్ని అనుకరించబోతే యీ దేశస్థులకు, యీ ధర్మపరులకు ఎంతకాలం రాజ్యం నిలుస్తుంది? స్వతంత్రాన్ని అమ్ముకునే ధర్మం. భార్యల శీలాన్ని యితరులు దౌర్జన్యం చేస్తున్నా, మాయ అనీ, విధికర్మమనీ నమ్మి శాంతం, శాంతం అనే యీ ధర్మశిలలను రక్తం మంచువలె గడ్డకట్టిన యీ వేదాంతవేత్తలను యెన్నాళ్లు ఆశ్రయించబోతుంది శౌర్యం? ధర్మంతో కళ్లూ చెవులూ మూతలు పడ్డాయా? స్త్రీ ఆర్తనాదం వినే శక్తిని, అబలని రక్షించుకునే పురుషత్వాన్ని నాశనంచేసే యీ ధర్మం వినుతి కెక్కబోతోంది యీ దేశంలో. పురుషులకూ పురుషులకూ ధర్మవిచక్షచేయమంటే ప్రతివాడూ ధర్మవేత్తలే, స్త్రీకి న్యాయం చెయ్యమని అడిగేటప్పటికి ఒక్కరికీ దయరాదు. నేను దాసినా? నన్నోడడం ధర్మమా? ఈ నీచుడు నన్నిట్లా బలాత్కరించడం న్యాయమా? ఇంతమంది పురుష పశువులు నన్ను అవమానించడం భారత సాంప్రదాయమా? ఆర్యమతచిహ్నమా?

భీష్ముడు—దానికి యుధిష్ఠిరుడే ప్రత్యుత్తరమివ్వాలి.

ధర్మరాజు—స్త్రీ సభను గర్హించి ధిక్కరించడం ఆర్యసమ్మతం కాదు.

ద్రౌపది—ఈ సభ రక్షించకపోతే నన్నెవరు రక్షిస్తారు?

ధర్మరాజు—స్త్రీ క్షేమం ఆమె భర్తలది.

ద్రౌపది—నాకు భర్త లేరీ? వుంటే యీగతి యెందుకు కలుగుతుందీ?

కర్ణుడు—దుశ్శాసనా! పద. దాని వస్త్రాలను తీసివెయ్యి.

ద్రౌపది—ఎవరూ యీ దౌర్జన్య మాపరా? మీ ముందు నన్ను వివస్త్రను చేస్తే నాకా సిగ్గు మీకా? నా నగ్నత్వం వీక్షిస్తే మీ గుడ్లు పేలవా?

వికర్ణుడు—ఛీ! కర్ణా! ఏమి కోర్కి? ఈ వీరు లందరూ స్వయంవరంలో యీమెకై యత్నించి పరాజితులైనారు.

కాని ఆమె దీప్తిని మరవలేక సమయము దొరికింది కదా అని యీవిధగా మమత తీర్చుకుంటున్నారు. కర్ణా! నీ ద్వేష మంతా ప్రచ్ఛన్న మోహాబలం.

కర్ణుడు—నోరు ముయ్యి. దుశ్శాసనా! సంకోచిస్తా వేమీ?

ద్రౌపది—రక్షించరా? పాండవులారా! పలకరా మీరు? మిమ్మల్ని కట్టివేసేది ధర్మం కాదు. మీ జ్ఞాతుల మీది ప్రేమ. మీరందరూ పురుషజాతి. బంధువులు. వేరుదాన్ని నేను. నాకై మీరు విరోధపడతారా? ఒక్క స్త్రీకోసం! ధర్మమా? ధర్మంతో జయిస్తారా మీరు? మీకు జయం కలిగే ముందు ఎంత అధర్మానికి వొడి గట్టవలసివొస్తుందో? ధర్మం జయిస్తుందా? అది కృతయుగంలో. మీ జూదం ధర్మమా? మీ భార్యని కాపాడడం మాత్రం అధర్మమా? ఛీ! ఈ దేశంలో స్త్రీరోదనం యెప్పుడూ అరణ్యరోదనమే. స్త్రీలను అమ్మి, అరణ్యాలకు తరిమి, చితిలో పేల్చి, జూదంలో వొడ్డి, సభలో వివస్త్రలను చేసే యీ భారతసంతతి గతి యేం కాబోతోంది? మా స్వతంత్రాన్నిట్లా నాశనం చేసి చేసి, మా మానాన్నిట్లా చంపిచంపి, మమ్మల్ని బానిసలుగా వుపయోగించి వుపయోగించి, మా బతుకు నీచం చేసి, నీచం చేసి. మా స్వతంత్రం, ధైర్యం, అభిమానం, మనోదారుఢ్యం, పీకి, చించి, జడుల్ని కళేబరాల్ని చేసి, మీ విరోధాలకూ యీర్ష్యలకూ, వ్రతాలకూ, స్వార్థాలకూ మమ్మల్ని బలిగా తీసుకుని, వుపయోగించుకుని, యెన్నాళ్లు బాగుపడపోతారు? మా కెటువంటి సంతతి పుడుతుంది యీ బానిసలకు? మా పుత్రపుత్రికలు మా పేర్లు తలుచుకుని అవమానపడరా? వాళ్ల భార్యల్ని యింతకన్నా నీచంగా చూడరా? ఈ సభలో యీడవబడి, వస్త్రహీనను చేసిన నన్ను, పురుషులు మీరు తిరిగి అంగీకరిస్తారా? నా పిల్లలు నాకే గౌరవాన్ని యిస్తారు, విన్నారా?

దుశ్శాసనుడు—రావే, దాసీ!

ద్రౌపది—నువ్వు పురుషుడివే అయితే నా చేతికో ఆయుధ మియ్యలేవా?

దుశ్శాసనుడు—దాసికి ఆయుధ మేమిటి?

ద్రౌపది—నా కెవరు దిక్కు? కృష్ణా! ఆపద్బాంధవా!

తెర

---

# కొలనుపాక క్షేత్రము

## శేషాద్రి రమణకవులు

నిజామురాష్ట్రములోని యాంధ్రదేశము నీమధ్య కాకతీయను సంకేత నామముతో వ్యవహరించిరి. ఇకముందు మా వ్యాసములలో కాకతీయసీమ యని వ్యవహరింతుము. కాకతీయసీమలోఁ గల ప్రసిద్ధ క్షేత్రములలో కొలనుపాక ప్రత్యేకగణనీయ మగు పవిత్రక్షేత్రరాజము. ఇచటి నేల యంత సారవంతమైనది గాకున్నను నంతర్వాహినులు గలవు. వీని సాయమున దీయఁబడిన కాలువలు పంటచేలకు వలసినంత జలము నొసంగుచుండును. ఎటుఁ జూచినను శివలింగములు వీరవిగ్రహములు, జైనవిగ్రహఖండములు, శిథిలవిగ్రహముల యునికి దెలుపు పాటిదిబ్బలు గ్రామము చుట్టును గలవు. జైనుల కభిమానదైవత మగు ఋషభదేవుని పవిత్రమూర్తి రెండవ శతాబ్దమునకు ముందే ఆంధ్రు లిచటఁ బ్రతిష్ఠించి జైనధర్మముల నాంధ్రులలోఁ బూర్వులు విరివిగా వ్యాప్తి నొందించిరి. వీరశైవాచార్యులలో నొకరగు రేణుకాచార్యులవారీయూర జన్మించిరి. అష్టాదశశైవజాతులకుఁ బ్రత్యేకప్రత్యేకములుగా మఠములు పైత మిందుఁ గలవు. ఈవ్యాప్తి కాకతీయుల కాలమున జరిగియుండనోపు. సోమనాథాలయము మిగులఁ బురాతనమైన దిందుఁ గలదు. పశ్చిమచాళుక్య కుటుంబసంబంధు లగు నొక శాఖవారికీ కొలనుపాక రాజధానిగ నున్న కాలమున సోమనాథుఁడు వారి కుపాస్యదైవతము. ఇటుఁ గల చారిత్రకవిశేషములు పేర్కొనకముందు ఇచటి జైనమతప్రశస్తిని గూర్చి కొంత దెలిపినచో ప్రాచీనకాలమునుండి కొలనుపాక వివిధమతముల కునికిపట్టై యెటు లభ్యున్నతికి వచ్చి క్రమముగ నెటుల క్షీణదశకు వచ్చెనో తెలిసికొనవచ్చును. కొలనుపాక బెజవాడనుండి హైదరాబాదు పోవు రైలుమార్గమునఁ గల ఆలేరుస్టేషనునకు నాలుగుమైళ్ల దూరమునఁ గలదు. రోడ్డుపయి నాలుగు మైళ్లు ప్రయాణము చేయునపుడు నుభయపార్శ్వములందును వీరవిగ్రహములు ఆలయశిథిలములు క్రియ్యాటతోఁ బాటు పంటకాలువలు గోచరించును. కొంచెము ఎఱుపుడాలుగల యిచటి మట్టి యొకకాలమున నాంధ్రవీరుల రక్తముతోఁ దడిసిన దని తోఁచును. పవిత్రస్థల

మగు నీగ్రామమునకుఁ జుట్టును ఐదుక్రోసులవఱకును జారిత్రకచిహ్నములు గోచరించుటచే నిది యొకకాలమున మహానగర మని తోఁచును. ఇచటఁ గల యత్యంతప్రాచీన మగు జైనాలయచరిత్రము ప్రకృతము నివేదింతుము.

కొలనుపాకలో నొక శిథిలజైనాలయము గలదు. కూలిపోవనున్న యీదేవాలయప్రశస్తి పాదాపుగ అంధ్రులు మఱచిపోయిరి. ఉత్తరహిందూస్థానవాసు లగు జైనులు తమ మతగ్రంథములలో కొట్టిపాక కుల్పాకి కొలనుపాకి యను వ్యవహారనామములు గల కుల్పాకమహాత్మ్య మెక్కువగాఁ బ్రశంసింపఁబడుటచే తెలుఁగుదేశమునం దిది యుండ నోపు నని గ్రహించి విశేషప్రయాసముతో నీక్షేత్రమును గుర్తించి జీర్ణజైనాలయమును మహావిశాలముగ రామణీయకముగాఁ బెంపొందించి శిథిలవిగ్రహముల క్రొత్తవి నిల్పి నూతన పద్ధతితో దేవాలయమును నిర్మించిరి. ఆలయము చుట్టును గొప్ప ప్రాకారము ముఖస్థలమున రెండు బురుజులు ప్రధానద్వారము నయి నొక మేడ నిర్మించుటచే బైటికి ఆలయము రాజభవనమువలె గోచరించును. ప్రాకారకుడ్యము ననుసరించి లోనను బైటను యాత్రికులకు వసతిగృహములు నిర్మింపఁబడినవి. ఆలయములో ఉద్యానవనము శిలాశాసనములూ పురాతనాలయశిల్పశకలములు నానాటి శిల్పపరిణామమును దెలుపుట కిందుఁ బొందుపఱుపఁబడియున్నవి. ఆలయమున కెదురుగ గొప్ప యుద్యానము గలదు. ఇందు రెండు దిగుడుబావులు భూమిలో నందందు లభించిన విగ్రహములు ఫలవృక్షములు జలయంత్రము చెఱకుపైరు రమణీయముగ గోచరించును. గ్రామమునకు గొంత దూరముగ నిర్మలవాయువులు వీచు విజనస్థలమందున్న యీయాలయము చూచుట కొక యాశ్రమమువలె నుండును. ఆలయపాలకులు మిగుల మర్యాద గలవారు. మిగుల సుహృద్భావముతో నచటి విశేషములు జరిత్రాంశములు విగ్రహముల యుదంతము దెలిపి యాత్రికులకుఁ జెఱకుపానకముతో నాతిథ్య మొసంగుదురు. వీరి యాదరణము ప్రశంసాపాత్ర మైనది.

“జినప్రభాసూరి విక్రమార్కశకము ౧౪౭ సం మందున్న శ్వేతాంబర జైనాచార్యుఁడు. ఈయన తీర్థకల్ప మను గ్రంథమును రచించి యందు కొలనుపాకలోని జైనవిగ్రహమును మిగులఁ బ్రశంసించెను. అందలి సారాంశ మిది. మరకతశిలతో అర్ధపద్మాసనస్థితముగ ఋషభదేవవిగ్రహము భరతుఁడు అయోధ్యలో బ్రతిష్ఠింప దానిని జూచి విద్యాధరులు తమ లోకమునకుఁ గొంపోయిరి. వారినుండి దేవేంద్రుఁడు గొని పూజించుచుండ రావణుఁ డింద్రుని జయించి లంకలోఁ జేర్ప మందోదరి యావిగ్రహమును శ్రద్ధాభక్తులతోఁ బూజించుచు రావణమరణానంతర మామె యామరకతవిగ్రహమును సముద్రములోఁ బాఱవేసెను. తరువాత కల్యాణనగరమున మహామారి వ్యాధి తలసూప ఆరాజ్యము పాలించు శంకరుఁ డను రాజు విచారపడుచుండఁ గలలోఁ బద్మావతీదేవి దర్శన మొసంగి “భక్తుఁడా! సముద్రాంతర్గతమై దేవపూజ నొందు పూర్వోక్తమరకతఋషభదేవవిగ్రహమును నీరాజ్యమునందుఁ జేర్చుకొని పూజించినచో వ్యాధిబాధలు తొలగును. వెనుకకుఁ జూడక విగ్రహమును గొనిరావలయు” నని చెప్పెను. శంకరరాజు అట్లు జేసి వెనుక జూడక వచ్చుచుండ ఋషభదేవవిగ్రహము సైతము వెనుక మహాధ్వనితో వచ్చుచుండెను. కొంత దూరము వచ్చిన పిదప వెనుకకుఁ జూడఁగ విగ్రహ మచటనే యాగిపోయెను. ఇట్లాగిన స్థల మగు కొలనుపాకయం దీవిగ్రహమునకు శంకరరాజు గొప్ప దేవాలయము గట్టించెను.”

ఈకథలోఁ బేర్కొనబడిన శంకరరాజు బుద్ధరాజు కుమారుఁడు కాలచుర్యుల తెగలోనివాఁడు. కాలము విక్రమశక ౬౮౦ అగును. పైకథ వ్రాసిన జినప్రభాసూరియు శంకరరాజున కీవలివాఁడైనవాఁడ యును. పైకథ గల తీర్థకల్ప మను గ్రంథము పునహాగ్రంథనిలయమున అముద్రితస్థితిలో నున్నది. పురాతనకాలమునుండి ప్రశస్తి గల ఈఋషభదేవుని విగ్రహము గల కొలనుపాకి కొఱకు మతాభిమానులగు జైనులు వెదకి వెదకి కనుగొనిరి. వారి మతగ్రంథములలో వివరింపఁబడినటుల సంప్రదాయముతో జెక్కు ననుక్రమములోఁ గాకాలమునందుటచే పన్నె తొలఁగినటులఁ జెప్పఁబడిన ఋషభదేవవిగ్రహమును గుర్తించి వెలికిదీసి లక్షలకొలఁది వెచ్చించి దేవాలయము కట్టించుటచే హిందూదేశమునందలి జైనుల కిందఱకును కొలనుపాకి దివ్యక్షేత్రము గా మాఱినది.

జినప్రభాసూరి గాక సంస్కృతమాగధభాషాకవియు శ్వేతాంబరజైనుఁడును నేమిచంద్రమహాకవియు కొలనుపాకి ఋషభదేవుని గూర్చి యొక గాథ వ్రాసియున్నాఁడు. ఈయన విక్రమశకము పదునాలుగవ శతాబ్దిలో నున్న బహుగ్రంథకర్త. సువరత్నాకర మను గ్రంథమున యతివర్యు లగు శ్రీయుత నేమిచంద్రజైను లను నొక యాధునికవిద్వాంసులు కొన్ని కథలు వ్రాసిరి గాని యవి విశ్వసనీయములు కావనియు దంతకథ లనియు జైనుల తలంపు.

కొలనుపాకలోని జైనవిగ్రహము లన్నియు దిగంబరములుగ లేవు. అచటి శాసనములందు శ్వేతాంబరజైనక్షేత్ర మనియే గలదు. శ్వేతాంబరజైనకవులే కొలనుపాకఋషభేశ్వరుని ప్రశంసించిరి. భగవతుని కాలమున మరకతశిలతో నిర్మింపఁబడిన ఋషభేశ్వరవిగ్రహము విద్యాధరులు ఇంద్రుఁడు మందోదరి పూజించిన పిదపఁ సముద్రములోఁ జిరకాల ముండుటచే మరకతశిలావిగ్రహము సహజకాంతి కోల్పోయి మైలతుత్తమువంటి పచ్చని శిలగ మాఱినట్లు జినప్రభాసూరి చెప్పినాఁడు. జైనమతవినాశనమునకుఁ బూనుకొన్న వైదికమతమువారు గరిత్రాత్మకము మనోహరజీవకళాలలితము నగు నీఋషభేశ్వరవిగ్రహమును మిగుల్చుటవలన ననే కొలనుపాకకుఁ జరిత్రసంబంధ మగు ఖ్యాతి దక్కుటయు ఆంధ్రక్షేత్రము యావద్భారతవర్షమునకు ఏకైకజైనక్షేత్రముగఁ బ్రఖ్యాతి గాంచుటయుఁ దటస్థించినది. పురాణకథలను విశ్వసింపనిచో విక్రమార్కశకము ౬౮౦ లో కొలనుపాకయందు కాలచుర్యరాజగు శంకరవర్మ ఋషభేశ్వగము గట్టించి మనోహరశిల్పములతో నింపఁ బ్రఖ్యాతినొందించుటయు వైదికవైష్ణవవీరశైవమతసంఘట్టనముల కోర్చి యది దాదా

పుగ పదునైదవ క్రీస్తుశతాబ్దమువఱకు బూజాపురస్యాగ్రహారముగ నుంటయు నైతిహాసికదృష్టితో శాసనాదిసహాయమున నిరూపింపఁదగిన యంశము. కొలనుపాక జైనాలయమునఁ గల ఋషభేశ్వరుని విగ్రహము దాదాపుగ ఆఱడుగుల యెత్తు గలిగి కూర్చున్నటుల నున్నది. విగ్రహము బహు సుందరమైనది. ఆకృతి యమరావతి, నాగార్జునకొండ రామిరెడ్డిపల్లి బౌద్ధశిల్పముల కళావిన్యాసముతో నలరి జీవకళల నుట్టిపడజేయుచుఁ బ్రాచీనాంధ్రశిల్పుల గౌరవ ప్రతిష్ఠల కాదర్శప్రాయముగా నున్నది. జైనవిగ్రహసముదాయము కాకతీయసీమలో విరివిగాఁ గనుపించుచున్నది. ఆంధ్రులలో నింకను జైనులు మిగిలియే యున్నారు. పూజాపురస్యాగ్రహారములఁ నెడయు జైనాలయములు గూడ మెదకుమండలమునందు విశేషించి కలవు గాని కొలనుపాక ఋషభదేవవిగ్రహమును బోలిన దివ్యసుందరమూర్తి గోచరింపదు. ఒకానొక శిలాశాసనమున నందలి ఋషభేశ్వరమూర్తిని కవి యిటుల ప్రశంసించినాఁడు.

"ప్రలంబకీకరముద్రామరకతమాణిక్యనిర్మితా వృషభమూర్తిః।
పుండరీకగణధరప్రతిష్ఠితా మహిమధామాభూత్॥"

పవిత్రతరమగు ఋషభేశ్వరమూర్తి జైనమతగ్రంథములందును శాసనములయందును నెటుల వర్ణింపఁబడెనో యటులే మరకతశిలతో నుంటయు నాఁటినుండి శ్వేతాంబరజైనుల కారాధ్యముగా నుండుటయు విశేషము. మధ్యకాలమున నెన్నియో జైనాలయములు వైదికాలయములుగా మారినవి. అనేకజైనవిగ్రహములు భైరవవిగ్రహములుగఁ బరిగణింపఁబడినవి. పద్మాక్షి వైదికదేవతయైనది. మహావీరాలయము కొలనుపాక వీరనారాయణాలయముగ మారినది. ఇతరమతవిజృంభణములకు లోనుగాక నేఁటివఱకుఁ బూర్వగౌరవమును నిల్పుకొన్న కొలనుపాక అగ్రజైనవిగ్రహమగు ఋషభేశ్వరమూర్తి ఆంధ్రమహాజనుల చిరకాలోపాస్యదైవతము. ఈదివ్యమూర్తి మందిరమహోన్నతములతోఁ బశ్చిమచాళుక్య, కాలచుర్య, చోళ, కాకతీయరాజ్యాంగముల నాఁటిన జాతీయధర్మప్రతిష్ఠ. ఇచటి విశేషములు మఱియొకమారు చెప్పవలసియున్నవి.

---

# సరస్వతీ టాకీస్‌వారి ద్రౌపదీవస్త్రాపహరణం

శిశుపాలుని మూర్తి, వేషమూ బాగున్నవి. ముఖ్యంగా [illegible] చాలా గాంభీర్యం కలిగించింది. అయితే: మొగాన ముదమే గాని, గంభీరతనం చాలినంతలేదు. ఆపైని కంఠమున్నా గంభీరమయినది కాదు. అది స్త్రీలలో జంతలకు తగినదే గాని శిశుపాలుడూ, కంసుడూ, యముడూ—ఇలాంటి పాత్రలకు తగినది కాదు. ఈనటుణ్ణి యిలాంటి పాత్రలకు నియమిస్తూ ఉన్న డైరక్టరు ఈసంగతి బొత్తిగా గమనించడం లేదు. దీనికి సాయం ప్రతీ అక్షరమూ సాగతియ్యడం. "యాదవాంగన లట. సిగ్గట" ఇలాంటి మాటలు పలికేటప్పు డిది చాలా రసాభాసం కలిగించింది. అంత కోపిష్ఠి—అంతటి క్రోధ—దీర్ఘక్రోధి అంత సాగతీసుకుంటూ మాట్లాడడమూ, అంత తాపీగా పనులు చెయ్యడమూ అస్వాభావికంగా ఉన్నది.

కరవులో అధికమాసం అన్నట్టు ఈ మాంద్యానికి తోడు నారదుని సంగీతం. నారదపాత్రధారి మంచి నటుడనే చెప్పాలి. కాని కంపెనీవారూ, డైరక్టరూ, స్వయంగా నటుడూ కూడా సంగీతం కోసం భ్రమపడినట్టుంది. ఇదే నిజమయితే వారికి ఆశాభంగమే కలిగింది. నారదుని పాటలో విశేషమేమాత్రమూ లేదు. అభినయమే నయం.

నారదు డెంతో కష్టంమీద కాళ్ళీడ్చుకుంటూ ద్వారం దాటాడు. శిశుపాలుడున్నూ యాదవాంగనను విడిచి కొంత దూరం వచ్చాడు. అంతే, ఇక కథ నడవదు. అక్కడ నారదుడూ ఇక్కడ శిశుపాలుడూ ఠకీమని మంత్రించినట్టు నిలిచిపోయారు. ఏమంటే! నారదు డెత్తుకున్న పాట అప్పటి కింకా పాతిక భాగమేనా కాలేదు. అత నంతటితో ఆపడు. శిశుపాలు డేనా దగ్గిరికి వెళ్ళి ప్రస్తావన ప్రారంభించి ఉంటే బాగుండును. అదీ జరగలేదు. ఇక [illegible] దేమీ గమనించలేదు. ఆపాటకోసం వెయ్యి అడుగు లేనా ఫిలిం ఖర్చయి ఉంటుంది. కొంచెం పూర్తిగా నడిచింది. ఇంతే కాదు. ఇంకా సేపూ నందుని, ఆఖరు పాటా విని, శిశుపాలుడు, నారదుణ్ణి "నువ్వు సాధించేమి ?" టంటాడు. నారదుడు "ఏదో నోటికి వచ్చిం"దంటాడు. అయితే: నారదుడు దేవర్షి కీర్తిస్తూ ఉంటాడో శిశుపాలు డెరగడూ? శిశుపాలుని తత్వం నారదునకు తెలవదూ? మరన్నీ, నారదుడు, శిశుపాలుణ్ణి ఉద్రిక్తుని చెయ్యడానికి—తద్వారా యాదవాంగనలను విడిపించడానికి "కృష్ణుని భార్యలను చెరపట్టడం పౌరుషం గాని యాదవాంగనలనా?" అంటాడు. శిశుపాలుని పక్షంగా యిది బాగానే ఉండవచ్చు; కాని నారదుడు చెప్పవలసిన సలహాయేనా? పైగా: నారదుడు, కృష్ణుని భార్యలను చెరపెట్టవలసిన దని సలహాచెప్పి, పాండవులు రాజసూయం చేస్తారనీ, కృష్ణునకు అగ్రపూజ చేస్తారనీ దానికి విఘాతం కలిగించవలసిన దనీ ఉపదేశం చేస్తాడు. దానికీ దీనికీ యేమి అతికినదీ! పాండవులదగ్గరనుంచి శిశుపాలునకు ఆహ్వానం వచ్చినట్లు లేదు. నారదు డక్కడ ఉండి ఇలాగ మాట్లాడుతూ ఉన్నప్పుడు పాండవుల దూత శుభలేఖ పట్టుకు వస్తే ఎంత చక్కగా ఉండేదీ!

పాండవసభలో, శిశుపాలుడు మొదటమొదట మంచి రాకడతే వచ్చాడు. కాని "ఓయి వైచిత్రతాతయ్యా" అని అందుకున్నవాడు "ఓరోరి భీష్మా" అని ముగించడంలో ఔచిత్యం చెడలేదూ! భీష్మునకూ శిశుపాలునకూ మాటా మాటా పెరిగితే తప్ప యీయెత్తుగడ యిలా ముగియడం బాగా ఉండదు. "ముయ్యినోర్" ఇత్యాదులకు కూడా యిక్కడ అవసరం లేదు. పోనీ, సలహా చెప్పు

న భీష్మునే ఇంత దూషించినవాడు అగ్రపూజ చెయ్యబూనిన ధర్మ రాజు నేమీ ప్రతిఘటించలే దేమీ? అసలు శత్రువే అయిన కృష్ణుని విషయంలో కూడా ఈవాక్పారుష్యం చూపలే దేమీ?

కృష్ణుడూ, శిశుపాలుడూ ఒకరిమీదకి ఒకరు వచ్చారు. అవ న్నాటప్పుడు శిశుపాలుడు గదను ఎడమచేత యెత్తి యెడమభుజాన పెట్టుకున్నాడు. ఈప్రదర్శనాటం భీమునకు కూడా సరిపోతే: కాని డైరక్టరుకు ఇందులో ఉండిన దోషం కనపడలేదు. చెప్ప వచ్చిం దేమి టంటే! శిశుపాలుడూ, కృష్ణుడూ చక్రువ మీదమీ దకి వచ్చారు. కాని కృష్ణుడు, శిశుపాలుడి దుష్కృత్యాలు వివరిం చే సీసపద్యాలు చదివేటప్పుడూ, చక్రం విడిచేటప్పుడూ ఒకరి కొకరు దూర మైనారు. ఏమీ? కృష్ణుడు వెనక్కి తగ్గినట్లా? శిశుపాలుడు వెనక్కి వెళ్ళినట్లా?

కృష్ణుడు చక్రం ప్రయోగించాడు. ఇందులో ఒక అసందర్భం. కృష్ణుడు మొదట పట్టిచెయ్యి చాపాడు. చక్రం ఉరుములతోటీ మబ్బులతోటీ ఆకాశాన కనపడింది. తరువాత కృష్ణుడు మళ్లీ చెయ్యి చాపాడు. అప్పుడు చక్రం అతని చేతనే ఉన్నది. ఇదంతా యే మిటీ!

శిశుపాలుడు, చక్రం కనబడగానే తెల్లబోయి, నోరు తెరిచి, గదను పనికిరాక విడిచిపెట్టేశాడు. ఎంచేతా! కృష్ణుడు చక్రాయుధు డనీ, ఆచక్రం అసాధ్యం అనీ తెలవకే అతను మీదమీదకి వెళ్లాడా?

పైగా, మొదట ఎక్కణ్ణుంచో వచ్చిన చక్రం, చివర కృష్ణుని మణిబంధంలో లీన మయింది. ఎంచేతా?

శిశుపాలుని కంఠం, తెగిన చప్పుడు సహజంగానే—చక్కగానే వినపడింది: కాని యీశిశుపాలవధ దుర్యోధనునిమీద తగినంత పనిచేసినట్టు కనపరచలేదు. అవసరం లేదా?

మొత్తానికి, గగ్గయ్యగారు మంచి నటులనడానికి సందేహం లేదు. అయితే: మొత్తం కథ అంతా ఆకళింపు చేసుకుంటూ ఉం టేనూ, తాము నటించబోయే పాత్ర తత్వం బాగా తరిచి గ్రహిం చుకుంటూ ఉంటేనూ, ఇలాంటి పాత్రలు ధరించే టప్పుడేనా పద్యాలూ, పాటలూ విడిచిపెడితేనూ వారి నటన సభ్యంగానూ, రంజకంగానూ ఉంటుంది; గాని యిక్కడ వారేమిటి నటు లం దరూ డైరక్టరు చేతి బొమ్మలు. డైరక్టరు భాగతభాగవతాలు సరిగా బోధపరుచుకున్నట్టు లేదు.

ఇక్కడ శిశుపాలునకు మద్యం అందించిన నర్తకిని గురించి కొంచెం చెప్పాలి. ఈటాకీలో నృత్యం పెట్టిన సందర్భం ఇది ఒక్కటే. అయితే: ఇక్కడ ఇది లేకపోతే ఫిలి మెంతమాత్రమూ చెడదు. ఇప్పుడు విశిష్టతకూడా యేమీ కలగ లేదు. అసలు, మద్యం తేవడం—నృత్యం చెయ్యడం—ఈరెండింటికీ యేమీ అతక లేదు. మొదట మద్యపాత్రపట్టుకునే నృత్యం చేసింది; కాని సాగ లేదు. తరవాత పాత్ర కింద పెట్టి నృత్యం చేసింది. విశేషం యేమీ లేదు. పిల్లమాత్రం చక్కగా ఉన్నది. అంతే.

ఉన్న దల్లా యేమి టంటే? ఈమె ఆంధ్రస్త్రీ కాదు. హిం దూస్త్రీ కూడా కాదేమో, అంచేతే ఆమె, నోరు కట్టుకోవలసి వచ్చింది. ఆమె శిశుపాలుని కేసి చూసినట్టే లేదు. బోలెడు డబ్బు సెనగపప్పులాగ వెచ్చించిన కంపెనీవారు ఇంకొక వేశ్యను తెనుగు దేశంనుంచి తీసుకువెళ్లడానికి లోభించడం యేమీ బాగా లేదు. ఆమెకంటే ఎన్నో రెట్లు చక్కగా నృత్యం చెయ్యగలవారు తెనుగు వేశ్యలలో వేలున్నారు. అసలు, కంపెనీవారు తీసుకువెళ్లినవారిలోనే మంచి నర్తకు లున్నా రేమో.

ఏమయినా, ఇది చాలా అసందర్భంగా ఉన్నది. తెనుగు ఫిలి ములో తెనుగుతనం నిలపడానికి ప్రయత్నించకపోవడం చాలా అనుచిత మైన పని. ఇది కంపెనీవారూ, డైరక్టరూ కూడా గమ నించలేదు. అసలు, వారికి ఈచూపే ఉన్నట్టు లేదు. అంచేతే, రాజసూయానికి రాజులు వచ్చినప్పుడు పూవులు చల్లిన ఇంద్రప్రస్థ పౌరకాంతల ముసుగులలోని అనౌచిత్యం కూడా వారికి కనపడ లేదు.

ధర్మరాజు రాజసూయానికి కూచున్నాడు. కృష్ణుడు సమీపం లోనే ఉన్నాడు. కాని పక్కన ద్రౌపది లేదు. ధర్మరాజుచేత ఒంటరిగా సంకల్పం చేయించడంలో చాలా తప్పు—ఘోర మైన తప్పు చెయ్యబడ్డది. ముఖ్యంగా, సత్యాకృష్ణులకు, ద్రౌపది హారతు లిచ్చినప్పుడు పాండవులను లేకుండా చేసినందుకు, ఇక్కడ ద్రౌపదిని లేకుండా చేసినట్లుంది డైరక్టరు.

పైగా, అర్జునుడు సంకల్పానికి పూర్వమే కృష్ణుణ్ణి ఆహ్వానిం చాడు. సంకల్పం చేశాకే గాని నకులుడు కౌరవులను ఆహ్వానించ లేదు. ఏమీ?

విదురుడు వచ్చి సుయోధనాదులను పిలిచినప్పుడు భీమాదులు ఏమి టేమిటో అనుమానాలు చూపించారు. అన్నగారికి సలహాలు చెప్పారు. ఉచితంగానే ఉన్నది. అయితే: నకులుడు వచ్చి పిలిచి నప్పుడు కౌరవసభలో గుసగుస లేమీ నడిపించనక్కరలేదూ? నకు లుడు దుర్యోధనుణ్ణి అయినా పిలవవద్దూ?

పిలుపులవిషయంలో డైరక్టరు ఇంకొక పెద్ద తప్పు చేశాడు. అర్జునుడు, కృష్ణుణ్ణి పిలిచినప్పుడు సత్య దగ్గరే ఉండినా ఆమెను పిలువలేదు. అతను, "అమ్మో! మిమ్మల్ని విడిచి నేనుండగలనా?" అంటూ సత్య కృష్ణుణ్ణి పెనవేసుకున్నప్పుడేనా ఆమెను పిలవలేక పోయాడు. పలకరించలేదు కూడానూ. ఆమె ఉండలే దని కృష్ణుడు తీసుకువెళ్ళాడు. అంతే, అయితే: యాగానికి రుక్మిణీ, తక్కిన పట్టమహిషులూ వెళ్లనక్కరలేదూ? అర్జునుడు ఉద్యాన వనంలోకే వచ్చి, అక్కణ్ణుంచే స్వనగరానికి వెళ్లిపోయాడా?

ఇలాంటిదే యీఫిలుములో మరొక పెద్ద దోషమున్నది. పాం డవులను హస్తినాపురానికి తీసుకువెళ్లడానికి విదురుడు వచ్చాడు. పాండవులు ధనుర్బాణాలతో ఎదురేగి తీసుకువచ్చారు. ఏదో మాట్లాడుతున్నారు. జూదానికి వెళ్లవద్దని చెప్పడంకోసం ద్రౌపది వచ్చింది. అయితే ద్రౌపది విదురునికేసి చూడలేదు. విదురు డామె

కేసి చూడలేదు. పాండవులు తండ్రీ అని పిలిచిన పెద్దమనిషిని తమ శ్రేయస్సును కోరే బంధువును పాండవపట్టమహిషి చూడవలసిన పద్ధతి యిదేనా ?

ఈఫిలిములో డైరక్టరు పెట్టిన శిక్షను సరిగా వినియోగించుకున్నవారిలో విదురుడూ, భీష్ముడూ, ధృతరాష్ట్రుడూ ఎన్నతగ్గవారు. భీష్మవిదురుల వేషభాషలు చక్కగా నున్నవి. అయితే భీష్ముని కంఠము జంభోరా అయి ఉంటే చాలాబాగుండేది.

నిజంగా, ఈవస్త్రాపహరణఘట్టంలో ప్రత్యర్థులుగా నిర్ణయించతగ్గవారు, ఒక పక్షాన దుష్టచతుష్టయము, ఒక పక్షాన భీష్మవిదురులూను. పాండవులు నిమిత్తమాత్రులు. అంతే; కాని డైరక్టరు భీష్మవిదురులను సత్తకాయలుగా తలచినట్టున్నది.

ధృతరాష్ట్రపాత్రధారి కూడా ప్రశంసకు అందుకోతగ్గ వాడే. అంటే అభినయాని కన్న మాట. డైరక్టరుకు ధృతరాష్ట్రపాత్రకూడా అర్థం కాలేదు. ధృతరాష్ట్రుడు విదురునికంటే కొంచెం పెద్దవాడు. భీష్మునికంటే చాలా చిన్నవాడు; కాని వేషాన్ని బట్టి ఈఫిలిములో ధృతరాష్ట్రుడు తాతలకు ముత్తాతగా ఉన్నాడు.

రుక్మిణి చక్కగా ఉన్నది. పాటలో అర్థం లేకపోయినా మాధుర్యం ఉన్నది. కాని మొగమ్మీద కదలిక లేమీలేవు. భావప్రకటన యేమీ లేదు.

అసలు నిజం చెప్పవలసివస్తే డైరక్టరు నిర్ణయించిన యీకథాక్రమంలో రుక్మిణి రావలసిన పనే లేదు.

రుక్మిణితోపాటు రాధకూడా రానందుకు చాలా సంతోషించవలసిందే.

భానుమతి పాత్రధారిణి కూడా చక్కని మనిషి. కాని వేషం వాడుగా ఉన్నది. ఆమెను ఇంత మానముద్రాంకితురాలుగా ప్రవేశపెట్టడంలో డైరక్టరు ఉద్దేశం అగమ్యగోచరంగా ఉన్నది; కాని ఒక పద్యం ఆమెచేత చదివిస్తేగాని డైరక్టరుకు తృప్తి కాలేదు. ఆపద్యం—రామ రామ!

నిజంగా, కథ అర్థం చేసుకోలేక, డైరక్టరు, భానుమతి పాత్రధారిణికే గాక, భానుమతికి కూడా చాలా అపకారం చేసినట్టు స్పష్టంగా చెప్పవచ్చు.

డైరక్టరుచేత, ఇలాగ, వాడుచెయ్యబడ్డ పాత్రలలో కర్ణుడొకడు.

—మనవిచేస్తా
ఒకద్రష్ట

---

# హిందీవల్ల తెనుక్కి జరుగుతూ ఉన్న అపకారం

కాంగ్రెస్సు సమీపించడంవల్లా, అలహాబాదులో హిందీసాహిత్య సమ్మేళనం జరగడంవల్లా ఆంధ్రదేశంలో హిందీప్రచారం చేస్తూఉన్న ఆంధ్ర (?) యువకులు హిందీని గురించి చాలా గడబిడలు చేశారు. తెనుగు ఎంత త్వరగా చచ్చిపోతే అంత సంబరం కాదూ వారికి ?

రాజమహేంద్రవరంలో, కాంగ్రెస్సుసంఘమువారు ౩౧-౪-౩౬ మొదలు ౪-౪-౩౬ వరకూగల అయిదు దినములూ శ్రీరామజయంత్యుత్సవం జరిపారు. ఆసందర్భంలో, వారు, మొదటి రోజునమాత్రం వాల్మీకిరామాయణం పురాణం చెప్పించారు. అయిదురోజులూ తులసీదాసు హిందీరామాయణం పారాయణం చేయించారు.

తెనుగురామాయణం యేదీ వారికి దొరకలేదో, తెనుగు రామాయణం చదవడానికి కాంగ్రెస్సుసంఘంవారు అంగీకరించలేదో ! తెనుగువారు చూపిస్తూ ఉన్న యీహిందీమౌఢ్యం హిందూస్థానీలు కూడా చూపించలేరని చెప్పవచ్చు. శెబాస్ ! జాతీయత చాలా బాగున్నది.

---

## విరాళములు—విశేష చందాలు



## ఆధునికాంధ్ర వాఙ్మయం—తరవాయి

# వ్యాఖ్యానములు

## ఆంధ్రోద్యమదీక్షాదినం

ఇది, మొన్నటి సంవత్సరాదినాడు కొన్ని గ్రామాలలో జరిగించబడ్డట్టు వార్తలు వచ్చాయి.

ఆంధ్రోత్సవ సమావేశకుల తరఫున గుమ్మిడిదల వెంకట సుబ్బారావుగారిచ్చిన అంకెలను చూస్తే ఇది జరిపిన గ్రామాలు ఇరవైఆరు.

వీటిలో రాజమహేంద్రవరం, మద్రాసువంటి నగరాలు కూడా ఉన్నవి.

ఇంతే కాదు. ఢిల్లీ, బెర్హంపురము మొదలయిన ఆంధ్రేతర నగరాలను కలిపితే గాని యీఅంకె పూర్తి కాలేదు.

ఈకొద్ది స్థలాలలో అయినా ఉత్సాహకరంగా జరిగి ఉంటే బాగుండును.

కాని,—

రాజమహేంద్రవరం వంటి "తెనుగుగడ్డ" మీద —న్యాపతి సుబ్బారావుపంతులుగారి వంటి "ఆంధ్రభీష్ముని" అధ్యక్షత కింద జరిగిన సభలో సమావేశమయినవారు ఒక పదిజనముందికంటే యెక్కువ లేరు.

పైపెచ్చు పంతులుగారు అధ్యక్షత వహించారు. అంతే. ఒక్క అక్షరమేనా ఉచ్చరించలేదు.

భావరాజు కృష్ణారావుపంతులుగారు ఆర్థిక కారణాలతో ప్రస్తావమును ప్రతిపాదించి రాష్ట్రావశ్యకాన్ని నిరూపించారు.

శబ్బాప్రగడ సుబ్బారావుపంతులుగారు ఆంధ్రోద్యమము వెనక పట్టడానికి గల కారణాలు నిరూపిస్తూ బలపరిచారు.

దానిమీద, కారణాలు చెప్పవద్దని ఒకరు. "ఆంధ్రరాష్ట్రానికి రాజమహేంద్రవరమునే రాజధానిగా చేస్తే గాని అంగీకరించమని ఒకరు. ఆంధ్రరాష్ట్రనిర్మాణంవల్ల నష్టం ఉన్నదని ఒకరు.

ఇలాగ కొంతసేపు, క్లబ్బువాతావరణానికి తగిన వినోదాలు జరిగిన తరవాత ప్రస్తావం చివరికి తీర్మానించబడ్డది.

ఇక అక్కడ మద్రాసులో:—

ఆంధ్రోద్యమ దీక్షాదినకార్యక్రమంలో తోరధారణం ప్రధానం. ఆంధ్రరాష్ట్రం కావాలనడమూ, గంజాం ఆంధ్రభూభాగం ఒరిస్సాలో కలిసినందుకు అసంతృప్తి ప్రకటించడమూ—ఇవి అసలు విషయాలు.

ఆంధ్రమహాసభ స్థాయిసంఘకార్యదర్శి సుసర్ల శ్రీరామనరసింహంగారు, ఆసభను స్వయంగా సమకూర్చారు.

అయితే: ఆసభ, అంతకు ముందే నిర్ణయించబడ్డ కార్యక్రమం నిర్వహించడానికే గాని, అసలు, కార్యక్రమం నిర్ణయించడం కోసం కాదని యెరిగి ఉండిన్నీ, అధ్యక్షత వహించిన వేమవరపు రామదాసుపంతులుగారు, తోరధారణమునూ, తోరం కట్టుకున్న శ్రీరామనరసింహంగారినీ కొంచెం హేళన చేశారు.

తోరం కట్టుకోడం ఇష్టంలేనివారు ఆదే ప్రధానమయిన సభకు అగ్రాసనాధిపత్యం వహించకపోతే యేమి?

ఇక్కడ బెజవాడలో:

కొన్ని వేలమంది కృష్ణాస్నానం చేశారు ట.

అందరూ తోరాలు కట్టుకున్నారు ట.

ఆ అందరిలోనూ అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారున్నూ ఉన్నారు ట.

తమ్మా వారి సంగతి అలా ఉండనిద్దాం.

కాళేశ్వరరావుపంతులుగారు కార్యనిర్వహణంలో పక్కా చెయ్యి. ఏదేనా ఉద్యమంలో ప్రవేశించారంటే ప్రాముఖ్యమే కాని, వారికి, ఏమి జరుగుతూ ఉన్నదో, ఎవరేమనుకుంటున్నారో ఏమీ అక్కరలేదు.

కార్యవాదులకు ఉండవలసిన గొప్ప యోగ్యత యిది.

ఇట్టి కాళేశ్వరరావుపంతులుగారు ఆంధ్రరాష్ట్రం ఏర్పడేదాకా నిద్రపోమని తోరం కట్టుకోడం, ఉద్యమానికి చాలా బలకరం.

అయితే: ఈశపథాన్ని వారంతవరకూ పాలింపగలుగుతారూ?

ఆంధ్రరాష్ట్రనిర్మాణప్రయత్నాలకు అడ్డువచ్చే చాకచక్యాలు అన్నీ విడిచిపెట్టి, వారు, ఈవిషయంలో తమ శాయశక్తులా వినియోగిస్తారా?

ఆంధ్రజాతికి ఇంకా మసకలు వదలలేదు.

కావలసిన సర్వనాశం యింకా పూర్తి కాలేదనట్టున్నది.

## గవర్నరు రాఘవేంద్రరావుచౌదరిగారు

ఈడ్పుగంటి రాఘవేంద్రరావుచౌదరిగారు మధ్యరాష్ట్రాలకు గవర్నరుగా నియమించబడ్డారు.

ఒక ఆంధ్రప్రముఖుడు ఆక్స్‌ఫోర్డు యునివర్సిటీలో ప్రొఫెసరుగా నియమించబడ్డ కొద్ది రోజుల్లోనే ఇంకొక ఆంధ్రప్రముఖుడు తనది కాని రాష్ట్రానికి గవర్నరుగా ఏర్పరచబడడం చాలా బాగున్నది.

చాలా సంతోషం.

ఇంతవరకూ, తమ భుజస్కంధంమీద మోపబడ్డ కార్యభారాన్ని బాధ్యత యెరిగి చక్కగా నిర్వహించగలిగిన చౌదరిగారికి ఈ కొత్త—ఉన్నత—ఉద్యోగంలో సర్వవిధాలా విజయం కలగడానికేమీ సందేహం లేదు.

గవర్నరు రాఘవేంద్రరావుచౌదరిగారికి మా ప్రశంసలు అందిస్తున్నాము.

* * * * *

ఆంధ్రుని ప్రతిభ సామాన్యమైనది కాదు. పూనుకుంటే ఆంధ్రుడు చెయ్యలేని పని లేదు. అయితే: ఒక్క కాంగ్రెస్సు మాత్రమే ఆంధ్రుణ్ణి తొక్కిపెట్టి ఉంచగలిగింది.

## మొదలు

"దేశములో ఫాక్టరీలును, కార్ఖానాలును విరివిగా పెరుగుట వల్లనే ప్రజలకు దుర్భిక్షము తొలగి సుభిక్షము కలుగగలదని నేను నమ్మియున్నాను. అట్లయ్యును యిదివరలో నేను రాట్నముతోను చేమగ్గములతోను ఖద్దరువస్త్రములు తయారుచేయబడుటకు మనసార తోడ్పడి పనిచేసితిని.........కాని స్వరాజ్యము లభించే వరకు ఇవన్నియు తాత్కాలిక సాధనోపాయములుగానే నేను భావించుచున్నాను. మన జీవితతాపత్రయముల కన్నిటికని ఇదియే పరమహంసక్రియ యనియు సర్వబాధానివారిణి యనియు నమ్మజాలను......భారతదేశము వంటి దేశములో, యంత్రాగారములు విజృంభించినప్పటికిని, వ్యవసాయదారులకును, పల్లెకాపులకును ఉపవృత్తులుగా యీచేతిపను లెప్పటికిని స్థిరముగా అక్కరకు రావచ్చును. నేను గూడ గ్రామపరిశ్రమోద్ధరణమునకై తోడ్పడగలను; గాని యంత్రబలమును యంత్రాగారవ్యాప్తిని పూర్తిగా ఖండించునట్టియు సాంఘికసమత్వము పనికిరాదని వాదించునట్టియు కొందరు కాంగ్రెస్సువాదులవలె నేను గ్రామపరిశ్రమోద్ధరణావశ్యకతను గమనించుట లేదు"

ఖద్దరును గురించి యింకా అద్భుతకల్పనలూ, ముఖప్రీతి వాదాలూ జరుగుతూనే ఉన్న యీరోజులలో కాంగ్రెస్సు అధ్యక్షపీఠమునుంచే యిలాంటి వాదం వినపడటం సామాన్యమైన సంగతి కాదు. తమకు నచ్చిన సామ్యవాదప్రచారానికి ఆదర్శభూతమయిన సోవియటురష్యాను పదేపదే చూసి, బోధపరుచుకుని ఉన్న జవాహర్‌లాల్‌గారిలా చెప్పడంలో కూడా యేమీ వింత లేదు.

ఇక, ఉన్న సిల్లా యేమిటంటే ?

ప్రపంచానికి కొంతటికీ ఒకప్పుడు రాట్నమే గతిగా ఉండినది. అయితే: జనుల రుచులే కాదు, సాధనాలు కూడా పూర్తిగా మారిపోతూ వచ్చాయి.

పైనక, రాట్నం ఆడుతూ ఉండగానే మన స్వాతంత్ర్యం పోవడం యెరిగి ఉండిన్నీ, నేడు, రాట్నంవల్లనే స్వరాజ్యం వస్తుందని చెప్పడమూ, నమ్మడమూ చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది.

యంత్రాలు వాడడంవల్లనే యూరపుఖండం మన బజారు ఆక్రమించేసింది. యంత్రాలు వాడడంవల్లనే జపాను ఆయూరపుఖండపు బజార్లను తన సరకులతో ముంచేస్తోంది.

నాజూకైన బట్టలకే గాక, చౌకా బట్టలు వాడడానికన్నీ అలవాటుపడ్డ మనం ఖద్దరునే వాడతామనీ, దానివల్లనే మన అక్కరలన్నీ తీరతాయనీ ఈ విశ్వాసం మన యిరవై సంవత్సరాల పారిశ్రామిక జీవితాన్ని వ్యర్థం చేసింది.

ఇంతకీ :

కాంగ్రెస్సువారి కందరికీ ఉలికిపాటు కలిగించే యీమాటలు చెప్పడంలో జవహర్‌లాల్‌గారు చాలా ధైర్యమే కనపరిచారు; కాని ఇది నిరుపయోగం అని స్ఫుటంగా చెప్పలేకపోయారు. ఇలాంటి మొగమాటాలవల్లనే, మనం యూరపియనులతో యేపోటీకీ నిలవలేకుండా ఉన్నాము.

అయినా మించిపోయింది లేదు.

మళ్లీ కాంగ్రెస్సు జరిగే లోపున అయినా జవహర్‌లాల్‌గారు కాంగ్రెస్సును మిల్లుబట్టలదెసకు తిప్పగలిగితే అది తక్కువ సేవలోది కాదు.

## చూడవలసి ఉన్నది

అన్నవాడు —అన్నప్రకారం—రావుసాహేబు శ్రీగిడుగు వేంకట రామమూర్తిపంతులుగారు పర్లాకిమిడి విడిచిపెట్టారు.

ఆంధ్రభాషలో జీవం యెక్కడ ఉన్నదో కనిపెట్టినవారు పంతులుగారు. కనకనే, వారు, జీవం గల ఆంధ్రులు చెయ్యవలసిన పని చేశారు.

వారు మా ఆహ్వానం అంగీకరించి మా రాజమహేంద్రవరం ప్రవేశించారు.

హృదయపీఠం సుసజ్జితం చేసి స్వాగతం చెప్పుకుంటున్నాము.

అసలే కవిపండితనిలయం. రాజమహేంద్రనగరం, యిక, భోజసభ అవుతుంది.

కాని మురిసిపోవద్దు.

పన్నెండువేల చదరపుమైళ్ల తెనుగుగడ్డను, ఒఢ్రులు, విలాసంగా విరుచుకుపోయారు.

మూడు లక్షల ఆంధ్రులు స్వదేశంలోనే విదేశీయులయిపోయారు. స్వగృహంలోనే ఆగంతుకు లయిపోయారు.

ఆమూడు లక్షల ఆంధ్రుల, దృఢమైన అసమ్మతినీ, తీవ్రమయిన ప్రాతికూల్యాన్నీ కేంద్రీకరించి, ఏకముఖం చేసి, రోషాగ్నిగా మార్చి, పంతులుగారు దానిని ఆంధ్రుల ముఖ్య ఉంచారు.

పంతులుగారి రాకలో ఉన్న అంతరార్థం యిదీ.

భావదాస్యంలో మగ్గిపోతూ ఉన్న ఆంధ్రులు, దీనిని ఎంతవరకూ, అవగాహన చేసుకోగలుగుతారో, ఇప్పుడేమి చేస్తారో చూడవలసి ఉన్నది.

---

# చందాదారులకు విన్నపము

ప్రబుద్ధాంధ్రపనిమీద హైదరాబాదు వెళ్లి అక్కడి యెండలకు తాళలేక—జబ్బుపడి చాలా కష్టంమీద యివాళే యింటికి వచ్చి వ్యాఖ్యానాలు సరిగా రాయడానికి కూడా శక్తిలేకుండా ఉన్నాను. అంచేత ఈనెల సంచికలో కొన్ని పేజీలు తగ్గినవి. ౧౫వ తేదీని ప్రకటించక తప్పకపోవడంవల్ల ఇలా తటస్థించింది. క్షమించ కోరతాను.

౧౮-౮-౩౬
రాజమండ్రి

సుబ్రహ్మణ్యశాస్త్రి
సంపాదకుడు

**Suppliment to the Issue.**

# కలాభివర్ధని పరిషత్తు

## ఇన్నిస్ పేట, రాజమండ్రి

(కలరగివారి యింట్లో)

మా వద్ద ఆధునికుల గ్రంథాలన్నీ సిద్ధంగా ఉన్నవి. ఈ కేటలాగులో లేనివి, ఎప్పటికప్పుడు, క్రొత్తవి కూడా సమకూరుస్తూనే ఉంటాము. పోస్టుఖర్చులు కొనేవారే పెట్టుకోవాలి. ఒక రూపాయకు తక్కువ వెలగల పుస్తకాలు వి. పి. గా పంపము. చాలా పుస్తకాలు ఒక్కసారి తెప్పించుకొనేవారికి రైల్వేపార్శలుగా పంపుతాము. రైలు పార్శలు ఏస్టేషనుకు పంపాలో వివరంగా రాయాలి. అడ్వాన్సు పంపిన ఆర్డర్లు రైల్వేలో పంపము. లైబ్రరీలకు ప్రత్యేకశ్రద్ధ చూపిస్తాము.

### పూలదండ-మొదటిభాగము

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి చిన్నకథలు ఈ వరుసతో వాల్యూములుగా ప్రకటించబోతున్నాము. ఈ మొదటిభాగం అచ్చులో నున్నది. చిన్నసైజు. పెద్దఅచ్చు. చక్కని బైండు. కొద్దిరోజుల్లో వెలువడుతుంది. పేరుపొందిన కథలు. ఒక్కొక్కటి ఒక్కొక్క నవల అని చెప్పవచ్చు.

### ప్రబుద్ధాంధ్ర-మాసపత్రిక

సంవత్సరచందా, వార్షికసంచికతో ౧-౮-౦ సంపాదకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. మన వారిక ఆంధ్రత్వాన్ని ఉజ్జీవింపచేసే పత్రిక ఇది ఒక్కటే. చిన్నకథలకూ వ్యాఖ్యానాలకూ ఇది పేరుపొందినది. శాంపిలు ప్రతి ఉచితంగా పంపుతాము.

### ప్రబుద్ధాంధ్ర-అయిదోసంపుటం

౧౯౨౮ సంవత్సరపు ౧౨ సంచికలూ (గ్లేజు ప్రతి) చక్కని బైండుతో అమ్మకానికి సిద్ధంగా ఉన్నవి. కొద్ది ప్రతులు మాత్రమే ఉన్నవి. పోస్టుఖర్చులతో వెల ౨-౦-౦.

### ప్రబుద్ధాంధ్ర-వార్షికసంచిక

ప్రబుద్ధాంధ్రకు యీయేడు జులైలో వార్షిక సంచిక ప్రకటిస్తున్నాము. చందాదారుల కిది ౦-౮-౦ లకు ఇస్తాము. తెనుగులో ఇలాంటి సంచిక లేదనేటట్టు ఉంటుంది. ఇతరులకు లభించడం కష్టం.

కవికొండల వెంకటరావుగారివి

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | | పాట్టికత | ౦ | ౮ | కుమారగకంఠము | ౧ | ౪ |
| విప్రసందేశము | ౧ | ౦ | ఆత్మవ్యక్తి | ౦ | ౮ | జనపదములు | ౦ | ౪ |
| జంటలు | ౧ | ౦ | చిట్టికత | ౧ | ౬ | కలరుతము | ౧ | ౪ |
| త్రయి | ౦ | ౧౪ | కోనేరు | ౦ | ౪ | మాతృదేశ సంకీర్తనము | ౦ | ౪ |
| నెలబాలుడు | ౦ | ౧౨ | ప్రకృతిచందనం | ౧ | ౪ | ఈ పుస్తకాలన్నీ ఒక్కమారుగా | | |
| వివిధకుసుమావళి | ౦ | ౧౨ | చదువులదుత్త | ౦ | ౪ | పుచ్చుకునేవారికి | ౫ | ౦ |
| ఆగడపలు | ౦ | ౮ | | | | | | |

నాలుగవ భాగము [illegible]

**Neglected Emperorpoet** 0 8
**Spiritual Swadesi** 1 0
**Age of Vemana** 0 6

### మార్కండేయభవనం వారివి

సచ్చిదానందం (యునివర్సిటీ పోటీకి వెళ్లిన నవల) ౧ ౦
కథాకావ్యము (పద్యాలు) ౦ ౧౨
కథాకావ్యము (వచనం) ౦ ౧౨

### వెంపటి సత్యనారాయణగారివి

అక్బరు సార్వభౌముడు ౦ ౪

### శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి

వీరపూజ— చరిత్ర ౦ ౧౨
రక్షాబంధనము—డిటెక్టివునవల ౧ ౦
శ్మశానవాటిక—డిటెక్టివునవల ౦ ౧౨
మిథునానురాగము—చారిత్రికనవల ౧ ౦
అనాధబాలిక—సాంసారికనవల ౦ ౬
నాగకాంత—నాటకము ౦ ౧౨
విజయనగరరాజుల కథలు ౦ ౩
చిత్తూరురాజులకథలు ౦ ౮
ఢిల్లీచక్రవర్తులకథలు ౦ ౮
గోల్కొండనవాబులకథలు ౦ ౨
శృంఖల—విమర్శగ్రంథము ౦ ౧౨

### డా. చిలుకూరి నారాయణరావుగారివి

జర్మనీదేశపు విద్యావిధానము ౧ ౦
ప్రాచీన విద్యాపీఠము ౧ ౮
ఆంధ్ర—లేక మెండిశిఖండి—నాటకము ౧ ౮
సంస్కృతలోకోక్తులు ౧ ౦
అశ్వత్థామ—అచ్చి—౨నాటకాలు ౦ ౧౨
అశోకుని ధర్మశాసనములు ౨ ౦
ఉమార్ ఖయ్యామ్—రుబాయత్ ౦ ౪
ఉపనిషత్తులు ౦ ౬

### చింతా దీక్షితులుగారివి

శబరి—కొత్తనాటకము ౧ ౦
ఏకాదశి—౧౧ చిన్నకథలు ౦ ౧౨
పరిణామవాదము—తన్ని దర్శనములు ౦ ౧౨

### పురాణం సూరిశాస్త్రిగారివి

నాట్యోత్పలము ౧ ౦
నాట్యాశోకము ౧ ౦
విమర్శక పారిజాతము ౧ ౦
ఆంధ్రనాటక సంస్కరణము ౦ ౮

### నోరి నరసింహశాస్త్రిగారివి

శీతమాలిక ౦ ౧౨
సోమనాథ విజయము ౦ ౧౨
భాగవతావతరణము ౦ ౪

### జనమంచి వేంకటరామయ్యగారివి

నవకుసుమాంజలి—ఖండకావ్యసంపుటి ౧ ౮
మాలతీమాధవము—నాటకము ౦ ౧౨
రాజశేఖరుని విద్ధసాలభంజిక నాటకము ౧ ౮

### శ్రీపాద కామేశ్వరరావుగారివి

చంద్రగుప్త నాటకము ౧ ౮
భారతరమణి డిటో ౧ ౦
రాణాప్రతాపసింహ డిటో ౧ ౮
శివాజీశీలము డిటో ౧ ౦
లీలావతీసులోచనలు డిటో ౧ ౦
బిల్వమంగళ డిటో ౧ ౦
శ్రీమాధవాచార్యవిద్యారణ్య ౧ ౦
చిత్తవృత్తి డిటో ౧ ౦
ఒకపెగ్గు డిటో ౧ ౦
పునర్వివాహము డిటో ౧ ౦
తెగినకాస్తి డిటో ౧ ౦
సంభాజీనిర్యాణము డిటో ౧ ౦
కళాపహాస్ డిటో ౧ ౦
సాహిత్యమీమాంసవిమర్శగ్రంథము ౧ ౪
నాటకవిమర్శ డిటో ౨ ౦
కొత్తల్లుడు ప్రహసనము ౦ ౮
పిసినిగొట్టు డిటో ౦ ౮
జగన్నాథమాహాత్మ్యము—ప్రబంధము ౦ ౧౨

### జయంతిపురం జమీందారుగారివి

భారతదేశపురైళ్లు ౦ ౧

### మల్లంపల్లి సోమశేఖరశర్మగారివి

అమరావతీస్తూపము ౦ ౧౨

### విశ్వనాథ సత్యనారాయణగారివి

వేనరాజు ౧ ౦
అనార్కలీ ౧ ౦
కిన్నెరసానిపాటలు ౧ ౦
ఆంధ్రప్రశస్తి ౧ ౦
ఏకవీర ౧ ౦

### సీరము సుభద్రయాంబగారివి

సురుచీవిజయము ౦ ౪

### మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారివి

పాలవెల్లి ౦ ౪
తేనెపట్టు ౦ ౪
ఉదంకుడు ౦ ౧౨
విరిసెజ్జ ౦ ౪

### పూలతోటగ్రంథమాలవారివి

వేయిస్తంభాలగుడి శాసనము ౨ ౦
మల్లికార్జునరావు. సాంఘికనవల ౦ ౧౦

### డిగవల్లి వేంకటశివరావుగారివి

ఇంగ్లీషుతెనుగు సారభాషికఘంటువు ౨ ౪
అధినివేశస్వరాజ్యం (సాదా ప్రతి) ౦ ౪
సహకారవస్తునిలయోద్యమము ౧ ౦
భారతదేశనిపెరిగితులు ౦ ౨

### బసవరాజు అప్పారావుగారివి

గీతములు ౦ ౪

### విజ్ఞానచంద్రికామండలివారివి

లక్ష్మణరాయవ్యాసావళి ౧ భాగము ౨ ౦
కృషిశాస్త్రము ౨ ౮
సాంఖ్యశాస్త్రి ౧ ౮
రాయమార్తాండుడు ౧ ౮
కొమర్రాజు వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్ర ౨వ భాగము ౧ ౧౨
అమెరికాసంయుక్తరాష్ట్రాలు ౧ ౪
బ్రహ్మాండలోకోత్పత్తి ౧ ౧౮
దక్షిణాఫ్రికా ౨ ౦
హిందూమహాయుగము ౧ ౮
హైందవవీరపుత్రుల జీవితములు ౧ ౮
కురుక్షేత్రప్రజాపాలికము ౧ ౧

### గుడిపాటి వేంకటాచలంగారివి

మాకర్మమిట్టాకాళింది ౦ ౧౨
బిడ్డలశిక్షణ ౦ ౪

### మారేపల్లి రామచంద్రశాస్త్రిగారివి

తెనుగులోబుట్టువులు ౦ ౪
బిల్హణీయం ౦ ౪
పారిజాతాపహరణం ౦ ౪
కవిగారి మనుగడ (జ. సుబ్బారావు గారు) ౦ ౪
కథారత్నాకరం ౦ ౧౦

### విశ్వసాహిత్యమాలవారివి

లియోటాల్‌స్టాయి ౦ ౩
క్రైస్తవప్రభుత్వనిర్మాణచరిత్ర ౦ ౪

### నరహరిశెట్టి వెంకటరత్నంగారివి

ఆంధ్రసాహిత్యదయము ౧ ౮

### మంగిపూడి వేంకటశర్మగారివి

మక్షికత ౦ ౮
నిరుద్ధభారతము ౧ ౬
బాలవితంతువిలాపము ౧ ౬
భీష్మునిచరిత్ర ౦ ౧౨
సాధుసంజీవనము ౦ ౮
కోయిల పాటలు ౦ ౬
వీరమతి నాటకం ౧ ౧౨
సహకారవిజయం ౧ ౧౨

### [illegible] వేంకటరత్నంగారివి

రత్నా[illegible] (ఖండకావ్యాలు) ౧ ౮

### త్రిపురనేని రామస్వామి చౌదరిగారివి

సూతపురాణము ద్వితీయాశ్వాసము ౧ ౦
సూతపురాణము తృతీయాశ్వాసము ౧ ౦
కురుక్షేత్రసంగ్రామము ౧ ౧
శంబుకవధ (ఉత్తరరామచరిత్ర) ౦ ౧౨
కుప్పుసామి శతకము ౦ ౨
వివాహవిధి ౦ ౧

### ఆంధ్ర[illegible] శేషగిరిరావుగారివి

కేయూరబాహుచరిత్రము వచనము ౦ ౮

### బొడ్డు బాపిరాజుగారివి

విపంచి (ఖండకావ్య సంపుటి) ౦ ౪

### వినోదవర్ధనీ గ్రంథమాలవారివి

మధుమురళి (ఉమర్ ఖయ్యాం) ౦ ౧౨
అంపశయ్య (నాటకము) ౧ ౦
పాండవాంకురము (నాటకము) ౧ ౦

### [illegible] అచ్యుతరావుగారివి

విజయనగరసామ్రాజ్యమండలి
ఆంధ్రవాఙ్మయ చరిత్రము ౨ ౦

### వేటూరి ప్రభాకరశాస్త్రిగారివి

ప్రతిమా నాటకము ౧ ౦
భగవదజ్జుకము ౦ ౬
కడుపుతీపు ౧ ౪
కపోతకథ ౧ ౪
మూన్నాళ్ళ ముచ్చట ౦ ౪
విశ్వాసము ౦ ౧
మత్తవిలాసము ౦ ౧
చిన్ననాటి చేష్టలు ౦ ౧

### కర్లపాలెం కృష్ణారావుగారివి

వివేకానంద నాటకము ౦ ౧౨
మల్లెపూలు ౦ ౧౨
వ్యాసమంజరి ౦ ౧౨
ఆంధ్రదేశము మొదటిభాగం ౦ ౧౨
ఆంధ్రదేశము రెండవభాగము ౦ ౧౨
(యూనివర్సిటీ పోటీకి పెట్టినవసల)

### బరంపురం కళాప్రచారక సమితివారివి

సంజయరాయభారము ౧ ౦
శ్రీకృష్ణరాయభారము ౧ ౦
సంజయ శ్రీకృష్ణరాయభారాల ఏకబైండు ౨ ౦
కర్ణచరిత్ర ౦ ౧౦
కోటీశ్వరవిజయ ౧ ౮
శ్రీకృష్ణుడు ౦ ౧౧
కారవాక, అశోకుని వితంతు
వివాహము ౧ ౦
జానకీ పరిణయము ౦ ౮
నారదమహర్షి చరిత్ర ౦ ౮

### మధిర సుబ్బన్న దీక్షితకవిగారివి

కాశీమజిలీకథలు
మొదటి భాగము ౧ ౭
రెండవ భాగము ౧ ౭
మూడవ భాగము ౧ ౧౨
నాల్గవ భాగము ౧ ౧౨
అయిదవ భాగము ౧ ౮
ఆరవ భాగము ౧ ౧౨
ఏడవ భాగము ౧ ౧౨
ఎనిమిదవ భాగము ౧ ౧౨
తొమ్మిదవ భాగము ౧ ౧౨
పదవ భాగము ౧ ౧౨
పదకొండవ భాగము ౧ ౧౨
పన్నెండవ భాగము ౧ ౧౨
అనుబంధము ౦ ౧౨

### ఆర్యపుస్తకాలయము వారివి

సీతాదేవి వనవాసము ౦ ౧౨
తుకారాము చరిత్ర ౦ ౧౦
విదుషీమణులు ౦ ౧౨
సావిత్రీదేవి ౦ ౧౨
సతీదేవి ౦ ౧౨

### భమిడిపాటి కామేశ్వరరావుగారివి

అప్పను ౧ ౮
కాలక్షేపము ౧ ౮
అప్పాకు ౧ ౮
నిజం ౧ ౭

### వద్దాది సుబ్బారాయుడు గారివి

వసురాయచాటు ప్రబంధము రేపుకు ౧ ౮
కాలికో బయండు ౨ ౧
అభిజ్ఞాన శాకుంతలము ౧ ౧
వేణీసంహారము ౧ ౧
మల్లికామారుత ప్రకరణము ౧ ౧౦
ప్రబోధచంద్రోదయ నాటకము ౧ ౧౨
చండకౌశిక నాటకము ౧ ౧౦
విక్రమోర్వశీయ నాటకము ౧ ౮
సూక్తివసు ప్రకాశకము ౧ ౧౨
కుందమాల ౧ ౧౨
ఆర్తనమ్మమణిశతకము ౧ ౪
సుగుణ ప్రదర్శకము ౧ ౪
భక్తచింతామణి పాకెట్టు ప్రతి ౦ ౫
కాలికో ప్రతి ౧ ౮
భగవత్ప్రార్థనములు ౧ ౧
నందనందన శతకము ౦ ౨
విశ్వరూప నృసింహస్తవద్వయము ౦ ౨
దైవభక్తిపద్యాసము ౧ ౩
ఆంధ్రమేఘసందేశము ౧ ౭
సూర్యశతకము ౦ ౮
భామినీ విలాసము ౦ ౧౦
సతీస్మృతి ౧ ౪
సుతస్మృతి ౧ ౪
గౌతమీ మహాజల మహిమానువర్ణనం ౦ ౨
సుమనో మనోజ్ఞము ౩ భాగాలు ౧ ౦
గ్రామ్య పదప్రయోగము అచ్చానర

### చిలుకూరి వీరభద్రరావుగారివి

శ్రీనాథకవి ౨ ౦
అళియ రామరాయలు ౧ ౮
తిమ్మరుసు మంత్రి ౧ ౦
ఆంధ్రుల చరిత్ర ౩ వ భాగం ౨ ౦

### భాషామణీ పత్రికవారివి

అపోహావేశము నాటకము ౦ ౧౨
జ్యోతిషశాస్త్రము—జాతకభాగము ౦ ౮
శాపము (నవల ౧వ భాగము) ౦ ౧౨

మాకడ నవీనకవుల గ్రంథాలన్నీ దొరకును. రూపాయకు తక్కువ ఖరీదు పుస్తకాలు వి. పి. గా పంపము. పోస్టుఖర్చులు కొనువారే భరించాలి.

# సరస్వతీగ్రంథమండలి



కంభంవారి సత్రమువీధి  రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగొల్పు బొమ్మలతో—ముద్దులొలుకు క్యాలికో ? యిండుతో—[illegible]మాసముల కొక్క చక్కని నవల చదువ చదువు చిన్నచిన్న అను [illegible]గ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము [illegible] 0-4-0 [illegible] చందాదారులు ఒకేసారి రు 7-8-0 ను ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 25 కుంకుమభరిణి | 1 8 0 | 39 అగ్రహారము | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 40 ఛిన్నవాస్తము (1 వ భాగము) | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 41 ఛిన్నవాస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 42 కింకరరహస్యము | 1 8 0 |
| 15 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 | 29 అం[illegible]భాయి | 1 8 0 | 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 44 సంజీవి (2 వ భాగము) | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 45 వ్రజరాణి | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 | [illegible] | 1 8 0 | 46 హత్యాభ్రమ | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 33 మొగలాయీదర్బారు 4 భా॥ | 1 8 0 | 47 కాశీఖండము | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 | 35 ఆటిన్ మనోలా | 1 8 0 | 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | 36 అపరిచిత | 1 8 0 | 50 దాసీకన్య | 1 8 0 |
| 23 ఘటకాచక్రము | 1 8 0 | 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | 51 స్త్రీ సాహసము ప్రథమభాగము | |
| 24 రాజసుందరి | 1 8 0 | 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | (అచ్చులోనున్నది) | 1 8 0 |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యురంగిణి | 0 12 0 | 9 యమునాబాయి | 1 0 0 | 17 లలిత | 1 0 0 |
| 2 అభాగిని | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 18 పెండ్లిదండ | 1 0 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 11 కాంతికథలు (చిన్నకథలు) | 1 0 0 | 19 కథావళి | 1 0 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 12 కాలసర్పి | 1 0 0 | 20 నాలుగుకథలు | 1 0 0 |
| 5 కాంచనమాల | 1 0 0 | 13 భారతకథాసారం | 1 0 0 | 21 నీతిప్రబోధిక | 1 0 0 |
| 6 సీమంతిని | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 7 సుశీల | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 23 ఉదంకుడు | 0 12 0 |
| 8 శశిరేఖ | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 24 భేతాళకథలు | 0 12 0 |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 పాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 0 |
| 3 మివారుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

 ఈ గ్రంథములు రాజమండ్రీలో కలాభివర్ధనీ పరిషత్తులోను దొరకును.

వస్తుగుణప్రకాశిక మాదిరి పేజీ.

**ద్రాక్ష:**—ద్రాక్ష - మృద్వీకా - గోస్తనీ— Vitis vinifera.

జాతిభేదములు: ద్రాక్ష - Grapes. ఎండుద్రాక్ష - Sultanas. నల్లద్రాక్ష - Black large grapes. గింజలేని ద్రాక్ష చిన్నది- Muscateles. పెద్దవుద్రాక్ష - Raisians (Monakha)

స్వరూపము: ఇది ఉత్తమ లతాజాతిలోనిది. ఇది చాలదూరము వరకును ప్రాకును. దీని యాకు 4 లేక 5 కోణ దళములు గలిగి దళముల చుట్టును స్పష్టమగు కంగోరా గలిగి అఱచేతివలెను, ఆకురంగు నలుపు, ఆకుపచ్చ కలిసిన రంగు గలిగి యుండును. ఈ లత కచ్చటచ్చట చిన్న యూడలు కూడ నుండును. ఆకులసందులనుండి లతాకాండ మాధారముగా గొని కోలనగు పూగుచ్ఛకాండ లేచును. నులితీగలు కూడ కాండము నుండియే వడలును. యీ నులితీగెలే దీనికి విత్తనము. దీని ప్రకాండము పెలకలుగా నుండును. ఆకులు విడివిడిగా నుండును. పుష్పములలో కొన్ని మిథునములుగను, కొన్ని ఏకలింగములుగను గలవు. ఉండవలసినన్ని కింజల్కములు కూడ గలవు. పుష్పకాండమునుండియే కాయలు లేచును. యీ ఫలగుచ్ఛము గుండ్రముగను, కోలగను గూడ నుండును. ఒక ఫలగుచ్ఛమునకు రమారమి వందకాయలువరకును ఉండును. ఫలగుచ్ఛము కాళీలేకుండ దట్టముగా ఉండును. కొన్ని పళ్లు తెల్లగను, కొన్ని నల్లగను ఉండును. యీ తీగ సాధారణముగా శీతలప్రదేశములలో ఎక్కువగా పెరుగును. ఇది బెంగుళూరునందును, మలబారు, సేలం, పంజాబు ప్రదేశములయందును ఎక్కువగా పైరగును. దీనికి తేమగాలి పనికిరాదు. దీని కొమ్మలు అడ్డముగా పాతవలయును. ఇది జనుముతో దమ్ముచేసిన భూములలో పాతుదురు. ఇది అయిదారు అంగుళులు ఎత్తు పెరిగిన తరువాత కొనలను కత్తిరించవలెను. దీనివలన ప్రక్కనుండు కొమ్మలు పెరుగును. కత్తిరించిన పిమ్మట పువ్వులు పూసి కాయుట కారంభించును. యీ పండ్లనుండి సారాయిస్కి బ్రాండని తీయుదురు. దీని పండ్లే అవుషధమునకు ఉపయోగము.

అన్వర్థసంజ్ఞాపదములు: గుచ్ఛఫల - గుత్తుగుత్తులుగా నుండు ఫలములు గలది, చారుఫల - అందముగా నుండు ఫలములు గలది, రసాల - రసప్రధానమగు ఫలము, కాశ్మీరికా - కాశ్మీరదేశములో నుండునది.

గుణములు: ఇది తీపిని పులుపును గల రుచులు గలది. శీతవీర్యముగలది, స్నిగ్ధగుణము, స్వరమును బాగుచేయును. రక్తపిత్తము, శ్వాస, దప్పి, తాపము, క్షయ మొదలగువానిని హరించును. మూత్రదోషముల

నన్నింటిని బోజేయును. మిక్కిలి వీర్యవృద్ధి తృప్తిని గలిగించును.

నల్లద్రాక్ష : ఇంచుమించుగ ద్రాక్షకంటె నిది ఉత్తమగుణములు గలది, మిక్కిలి మధురరసము హృచ్ఛలనములను బోజేయును.

లేతకాయ : ఇది కొంచెము చేదుగను, వగరుగను ఉండును. వేడిచేయును. విశదగుణమును, పిత్త దోషమును గలిగించును.

మధ్యరకపుపండు : దీని రుచి మిక్కిలి పులుపు రుచిగా నుండును. జఠరదీప్తిని గలిగించును.

ఎండుద్రాక్ష :—శ్రమహారము, సంతర్పణము. పుష్టిప్రదము, సంభోగశక్తిని వృద్ధిపరచును. మధుర విపాకముగలది. విరేచనమును మూత్రమును కూడ చేయును. కఫకరము, మదాతిశయమును హరించును.

గింజలేని ద్రాక్ష : ఇది చిన్నదిగా నుండును. ద్రాక్షతో సమానగుణములు గలది.

మూత్రరోధజ, ఉదావర్తనము:—

ప్రయోగము ద్రాక్షపండ్లయొక్క రసము పరగడుపున త్రాగుచుండిన మూత్రరోధజ ఉదావర్తములు నివర్తించును. (శుశ్రుతము)

మదాత్యయములో గలుగు దప్పికి :—మదాత్యయములో మిక్కలి దప్పి గొనినచో వాతపిత్తములు ప్రకోపించునెడ చల్లనిద్రాక్షరసము నిచ్చిన దోషానులోమనమయి మదాత్యయ పిపాసలు క్షయించును. (వాగ్భటము చి. 7 అ.)

మూత్రకృచ్ఛ్రమునకు :—ఎండుద్రాక్షపండ్లు నీళ్లతో నూరి ఆ రసము త్రాగినను, రాత్రి ద్రాక్షపండ్లు నీళ్లలో వేసి ఉదయమున ఆ రసమును వడకట్టి త్రాగినను మూత్రకృచ్ఛ్రములు హరించును. (వాగ్భటము చి. 11 అ.)

రక్తపిత్తమునకు:—ద్రాక్షారసము ప్రస్థంస్నర, పురాణసర్పిప్రస్థం, యీ రెండును కలిపి నెయ్యి మిగులునట్లు కాచవలెను. ఆ ఘృతమును పానము చేయుచుండిన రక్తపిత్తము, కామలా, గుల్మము, పాండురోగము, జ్వరము, మేహము కూడ హరించును. (చక్రదత్త)

క్షయకాసలకు ద్రాక్షారిష్టము : 50 పలములు ప్రమాణముగల ఎండుద్రాక్షను మెత్తగా త్రొక్కి రెండు ద్రోణముల నీటియందు వేసి నాల్గవవంతు మిగులునటుల కాచి దానిని వడకట్టి తీసికొని చల్లారిన పిదప అందు 200 పలముల బెల్లమును వేయవలెను. మరియు దాల్చినచెక్క, యాలకులు, జాపత్రి, నాగకేసరములు ప్రేంఖణము, పిప్పళ్లు, మిరియములు వాయువిడంగములు యీ వస్తువుల యొక్క చూర్ణమును ప్రత్యేకముగా నొక్కొక్క పలము చేర్చి యివన్నియు నెయ్యి పూసిన కుండలో వేయవలెను. పైన మూకుడు మూతపెట్టి చీరమన్ను యిచ్చి ఒక మాసము నిలవ యుంచవలెను. పిమ్మట దానిని తీసి వడియకట్టుకొని సిద్ధము చేసుకొనవలెను. దీనినే ద్రాక్షారిష్టము అందురు. ఇది అర ఔన్సు మొదలు ఒక ఔన్సువరకు సమాన భాగ ముదకమును చేర్చి త్రాగుచుండిన క్షయ, దగ్గు, ఉరక్షతము, ఉబ్బసము, కంఠరోగములు హరించును. రక్తశుద్ధిని, రక్తబలమును కూడ చేయును. కాంతిని ప్రసాదించును. కాలవి రేచనమును చేయుచుండును. ద్రాక్షాసవమునకు కూడ నీ గుణమే గలదు. ఆసవ మనగా కాచకుండా తయారు చేయునది.

ద్రాక్షాదిక్వాథము : దీనిని తరుచు మలయాళ దేశమునందు వాడుచుందురు. సింహళమునందు కూడ దీని వాడుక మిక్కిలి గలదు. ద్రాక్షపండు, కరక్కాయ, నేలయుసిరిక, కర్కాటకశృంగి, కళింగరాస్నము, పిప్పలి, దూలగోపిల వేరు, తెల్లగలిజేరు, యెఱ్ఱగలిజేరు, వాకుడు వేరు యీ వస్తువులు కలిపి చేసిన చూర్ణమునకే ద్రాక్షాదిక్వాథచూర్ణమని పేరు. ఇది కషాయముపెట్టి త్రాగుచుండిన ఉబ్బసము, క్షయ, కాస మొదలగువని శమించును.

ద్రాక్షాసారాయము : ఇది ఘాటుగను కొంచెము తీపిగను కూడ యుండును. మత్తును గలిగించును. బుద్ధివికాసమును, చురుకును, ఆకలిని గలిగించును. ఉత్సాహప్రదమైనది. రోగక్షీణులకును, దుర్బలులకును మిక్కిలి ఉపయోగించును.








AMRUTANJAN
SOVEREIGN-REMEDY
AMRUTANJAN
"Best Indian Pain Balm
Amrutanjan Depot
BOMBAY MADRAS

# శాస్త్రీయౌషధములు

## శ్వాసావలేహ్యము

ఉబ్బసముతో బాధపడువారికి ఇది చాల ఉపయోగకరము. మలబంధమును విప్పుటలో దీనికి చాల పేరున్నది. ప్రేగులను శుభ్రపరిచి, ఘనీభవించిన శ్లేష్మమును కరిగించి, ఇది, తన్మూలంగా ఉబ్బసవ్యాధిని నిర్మూలము చేయును. మరిన్ని యిది రక్తపిత్తము, ఉరఃక్షతము, దగ్గులు, క్షయ—వీటికి గూడ అమోఘమైనది. సామాన్యంగా మలబంధముతో బాధపడువారి కందరికిని ఇది అత్యుపయోగకరము. సీసాను 1కి 3_0_0

## మహాఖండార్ద్రకలేహ్యము

మహారాజులు సుకుమారులు వాడతగిన ఔషధము. పైత్యమువలన కలిగే సకలబాధలను ఇది సమూలముగను శీఘ్రముగను దూరము చేయును. ఇది ఆమము పచనము చేసి, రుచి పుట్టించి ఆకలి కరకరలాడించును. శరీరపుష్టి, వీర్యవృద్ధి కలిగించును. అమ్లపిత్తము, శూల, పాండువు, శ్వాసకాసలు, కామల, పీనస, గుల్మము, కంఠరోగములు వీటిని జయించును. మలబంధమును పోగొట్టుటలో దీనికి ప్రత్యేకశక్తి కలదు. సీసాను 3_0_0

## మహాభృంగరాజతైలము

నరసిన వెంట్రుకలను నల్లబరచును. వెంట్రుకలను రాలనివ్వదు. చవిపోట్లు కంటిజబ్బులు తగ్గించును. శిరోవ్యాధులను చేరనివ్వదు. వెంట్రుకలను నల్లగను, మృదువుగను, పొడవుగను, గుబురుగను పెంచును. హెయిరు డైలతో దినదినము బాధపడువారు దీనివలన శాశ్వతఫలమును పొందగలరు. నమ్మకమైనది.

8 ఔన్సుల సీసా 2_0_0

## భృంగామలకతైలము

శిరస్సు వేడిగానుండుట, తలనొప్పి, కండ్లమంట, శిరోజములు తెల్లబడుట, రాలిపోవుట మున్నగు బాధలను అతిత్వరగా తగ్గించును. కండ్లకు చలవ చేయును. చుండు పుట్టనీయదు. అనిద్రను తగ్గించి సుఖనిద్ర కలిగించును. వెంట్రుకలను తుమ్మెదరెక్కలవలె నల్లబరచును. మరిన్ని కర్ణశూలలు, ఉన్మాదరోగములు, అపస్మారములు తగ్గించును. 4 ఔన్సులు 0–10_0 సీసా 2-0-0.

## గంధర్వదంతచూర్ణము

ఇది బజారు మాడిదలరకము కాదు. ఆయుర్వేదయోగము. దంతవ్యాధులను, ముఖవ్యాధులను పోగొట్టును. నోటి అరుచి, దుర్వాసన, పూత, దంతములనుండి రక్తము పడుట తగ్గించును. ఘుమఘుమలాడు చక్కని చూర్ణము. డబ్బి 0_4_0

## గంధర్వకస్తూరిమాత్రలు

చంటిపిల్లల జలుబు, దగ్గు, పడిసెము, అజీర్తి, విరేచనములు, ఆకలి లేకపోవుట, అన్నహితవు లేకుండుట, పాలు త్రాగకుండుట, కడుపు ఉబ్బరము, కడుపునొప్పి, డోకులు, జ్వరము, ఆయాసము అతి శీఘ్రముగా తగ్గించును. బాలెంతలకున్ను మిక్కిలి మేలుచేయును. సీసా 0_8_0

## ద్రాక్షారిష్టము

దగ్గు, పగిర్పు, క్షయ, మున్నగు కఫవ్యాధులకు మంచిది, రక్తపిత్తము ఉరఃక్షతము, జయించును. కఫవ్యాధి పీడితులకు కోష్ఠమును శుభ్రపరుచుటలో దీనికి ప్రత్యేకశక్తి యున్నది. బలవంతులును, ఆరోగ్యవంతులును గూడ దీనిని ఎప్పుడును వాడుచుండినచో చాల మేలు చేయును. లకోరి. తియ్యనిమందు. సీసా. 1_8_0

## ధాతురంజని

సంభోగసమయమున శీఘ్రస్ఖలనము కాకుండునట్లు చేయుటకు తయారుచేయబడినది. దీనిని సేవించినచో పురుషుల కానందమును స్త్రీలకు ప్రీతియును కలుగును. ఇది స్త్రీవశ్యము చేయు అమోఘౌషధము వీర్యస్తంభనము కోరు పురుషులు రాత్రి భోజనానంతరము సేవింపవలెను. ఒక్క గంటలో చెప్పినంత పని చేయును. 16 మాత్రలు 1-0-0

## వైక్రాంతభస్మము

కఫవ్యాధులలో చాల పనిచేయును. శ్లేష్మ ఉడుకు, మూత్రకృచ్ఛ్రములు తగ్గించును. వీర్యవృద్ధి, తేజస్సు కలిగించును. అనుపానభేదములతో అనేక గుణములు కలిగించును. తులము 2_0_0

## అయస్కాంతభస్మము

ఉబ్బు (నంజు) పాండువు, క్షయ, శ్వాసకాసలు, తిమ్మిరలు తగ్గించును. రక్తశుద్ధి చేయుటలో చాలశక్తి కలది. బలము, కాంతి, వర్చస్సు, నరములకు బిగి కలిగించును. తులము 3_0_0

రోగవివరాలు తెలుపువారికి ఔషధములు నిర్ణయించి పంపెదము.

## గంధర్వఫార్మసీ — ఇన్నిస్ పేట, రాజమండ్రి

రాజమహేంద్రవరము : శ్రీ అడ్డేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రితమై.
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే ప్రకటింపబడినది. ౨౦-౧౦-౧౯౩౩.